

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

శ్రీకాంచీకామకోటి పీఠాధిపతులు

జగద్గురు

శ్రీచంద్రశేఖరేంద్రసరస్వతీ

స్వాములవారి

# ఉపన్యాసములు.

అనువాదకుడు,

వేలూరి రంగధామనాయడు.

చిదానందమఠం, సుల్తాన్ బజారు,

హైదరాబాదు, డక్కన్.

1937.

గీ॥ ఖ్యాతి గాంచిన శ్రీకాంచి ♦ కామకోటి
పీఠ మేలుచు బ్రజలకు ♦ బ్రీతితోడ
జ్ఞానమార్గంబు బోధించి ♦ జన్మమెల్ల
సఫలముం జేయు నో యతి ♦ సార్వభౌమ
ప్రణతు లొనరింతు నీ పాద ♦ పద్మములకు ॥

శ్రీ కాంచీకామకోటి పీఠాధిపతి



జగద్గురు

శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారు.

# తొలిపలుకు.

ఈగ్రంథములోని యుపన్యాసములు, శ్రీకాంచికామకోటి పీఠాధిపతులైన, జగద్గురు శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారు, చెన్నపట్టణమందు ద్రావిడ భాషలో నుపన్యసించ, భక్తులచే బ్రచురింపబడెను. ఈ యుపన్యాసములు జ్ఞానసిద్ధికి మూలకారణమైనందున ద్రావిడము దెలియని యాంధ్రసోదర సోదరీమణులు *వీటిని పఠించి కృతార్థులు కాగలరను నపేక్షచే శ్రీస్వాములవారి యాజ్ఞనుబొంది యథామాతృకగ నాంధ్రీకరించి ప్రచురించనైనవి.

శ్రీస్వాములవారు పీఠాధిపతులేగాక, యంతర్ముఖులున్ను, యోగసిద్ధిసంపన్నులైన మహనీయమూర్తులు. వీరిదాతృత్వము, భూతదయ, శాంతము మొదలగు సద్గుణములజూడ నపరశంకరులనియే సిద్ధారణజేయనగును. మఱియు, నిటీవల గొన్నిమాసముల క్రిందట, పాశ్చాత్య దేశీయులగు, మిష్టర్ పాల్ బ్రన్టన్ దొరగారు, హిందూమతాభిమానులై, భరతఖండమెల్లదిరుగుచు, జ్ఞాననిష్ఠాపరులగు మహనీయుల నచ్చటచ్చట దర్శించుచు కడకు శ్రీస్వాములవారి సన్నిధినిజేరి జ్ఞానసంబంధమైన యనేక విషయముల జర్చించి సంతుష్టాంతరంగులై, శ్రీస్వాములవారి యెడల యత్యున్నతభక్తిగలిగి ప్రవర్తించుచుండిరి. ఇట్లుండ వారు యొకనాటిరాత్రి శయనించియుండు సమయమందు, హఠాత్తుగా మెలకువజెంది, యంధకారబంధురమైన, శయ్యాగృహమందు, దనయెదుట నొకఛాయ గనబడుచున్నట్లు దెలుసుకొనెను.

అంతలో నాఛాయను పరివేష్ఠించిన ప్రకాశమును గనినంతనే నాఛాయ క్రమముగా శ్రీస్వాములవారి సాక్షాత్స్వరూపమై స్పష్టముగా తననేత్రములకు గోచరించి క్రమేణయంతరించెనని తాను వ్రాసిన గ్రంథమూలకముగా దెలియజేసియున్నారు.

ఇందులోని వ్యాసములు 18న్నీ శ్రీభగవద్గీత యందలి పదునెనిమిది యధ్యాయములకు తుల్యమైనవని భక్తి శ్రద్ధలతో జదివెడు పాఠకులే గ్రహించగలరు. వీనియందు శ్రీస్వాముల వారు దయాపూర్ణులై తమ యాత్మానుభవమునెల్లను ధారాళముగ వెదజల్లిరి. వీటిని పఠించువారతిసులభముగా జ్ఞానసంపత్తినిబొంది సద్గుణోపేతులై ప్రవర్తిల్లి పరమేశ్వరుని కృపకు పాత్రులై సకల శుభములను బొందెదరుగాక !

ఈవ్యాసముల నాంధ్రీకరించుటలో బ్రహ్మశ్రీ వైద్య నాథయ్యరు బి. ఎ., బి. యల్., గారును, బ్రహ్మశ్రీ వంగిపురపు జగన్నాథ శాస్త్రిగారును, బ్రహ్మశ్రీ వఠెం సుబ్బయ్య జ్యోషి గారును శ్రద్ధాపూర్వకముగా నాకుసహాయులై నందున గ్రంథము పూర్తియైనది. వీరలకు నాకృతజ్ఞతా పూర్వకవందనములు.

శ్రీస్వాములవారీతెలుగు గ్రంథమును పరిశీలించి, తమ పూర్ణామోదమును బ్రకటించుటయేగాక, యనుగ్రహపూర్వకముగ, నుపోద్ఘాతమును లిఖించి నన్ను ధన్యుని జేసినందులకు, పునః పునః ప్రణామంబు లాచరించుచున్నాడను.

ఇట్లు విధేయుడు,

వేలూరి రంగధామనాయడు.

# విషయసూచిక.

ఓం

శ్రీ గురవేనమః

శ్రీ కాంచికామకోటి పీఠాధిపతి జగద్గురు
శ్రీ శంకరాచార్య స్వాములవారు చెన్నపట్టణమున
ద్రావిడ బాషలోనొసంగిన యుపన్యాసములు.

౧

# వేదోపదేశము.

మనవేదమనునది మొదట సత్యమును పలుకమని, రెండవది ధర్మమును నడిపింపుమని, మూడవది తల్లినిదైవముగా భావించుమని, నాలుగవది తండ్రినిదైవముగా భావించుమని, అయిదవది గురువును దైవముగా భావించుమనియు నుపదేశించుచున్నది.

మనయొక్క శైవము వైష్ణవము యనుయీరు మతములను మనపుణ్యభూమిలో స్థాపించుటకు వేలసంవత్సరములకు పూర్వము మనదేశములో యవతరించిన శ్రీఆదిశంకర భగవత్పాదాచార్య స్వాములవారు రచించిన ప్రశ్నోత్తర రత్నమాలికయను గ్రంథము నందు వేదమునందుచెప్పిన సత్యము, ధర్మము, వీటియొక్కతాత్ప ర్యములు యిట్లువివరించి యున్నారు.

ప్ర॥ కింసత్యం - సత్యమనగానేది?

ఉ॥ భూతహితం - ప్రాణులకు మేలుచేయునది.

తా॥ ప్రాణులకు క్షేమము గలుగుచేయు సత్యమే సత్యము.

ప్ర॥ కోధర్మః - ధర్మమనగానేది?

ఉ॥ అభిమతోయః సిష్టానాం నిజ కులీనానాం.

తా॥ తనయొక్క వంశమందుదయించిన సదాచారపరులగు సాధువులైన పూర్వీకులు యేది ధర్మమనితలంచిరోయదియే తనకు ధర్మము.

మనయొక్కొక్కరికి నొక్కొక్క తల్లి తండ్రి గురువుగలరు ఈ విధముగా వేర్వేరుగా యేర్పరచబడినవారిని మనము దైవముగా నెంచి నడుచుకొనుట యాధారముగాగాని ప్రపంచమందు మన కెల్లరకు తల్లి, తండ్రి, గురువులుగా ప్రసన్నులగు దేవి; దేవుడు; శ్రీదక్షిణామూర్తి లేక గీతలనుపదేశించిన శ్రీకృష్ణపరమాత్ములను వీరినిమరువక మనస్సునన్నెల్లప్పుడు జ్ఞప్తియందుంచుకొనవలయును.

వేద విదులగు బ్రాహ్మణులు వేదశాస్త్రములలో చెప్ప బడ్డ కర్మానుష్ఠానములను విసర్జించక సాధ్యమయి నంతవరకు వాటిని యాచరించుటతోసహా తమయొక్క వేషభాష నడవడి మొదలగువాటిచే భారమును పెంచు కొనక యధికవ్యయములను తగ్గించుకొని కొన్ని సమయములలో తిండికిలేక భాధపడురైతులు, పంచములు మొదలగువారలకు వారమునకొకతూరి ఆయాగ్రామ దేవతల సన్నిధానములో శుక్రవారమునగాని మంగళవారమున

గాని తమశక్తి కొలది గంజి, యంబలి, మొదలయినవి విని యోగించుటే విధిగా యాచరించుచుండవలయును.

వర్తకులు, రైతులు, కార్మికులు, సంసారులు మొదలగువారు తమ కులమందుదయించిన పెద్దల మనోభావముల ననుసరించి బ్రాహ్మణులను పంచములను ప్రీతితో ఆదరించుటేవిధిగా యాచరించుచుండవలయును.

పంచములు:— ౬౩ భక్తులలో తిలకమువంటివాడగు శ్రీ నందనారు యొక్క యాచరణమనుసరించిటయు, ఈశ్వరుని యందు యత్యంత ప్రీతిగలిగి తనయొక్క పూర్వీకుల కులాచార పద్ధతుల మీరినడువకుండుటయు. యను నీ రెండు యాచారముల యందు లక్ష్యముంచిన నందనారుని యంతర్జ్యోతి యేవిధముగా పరమశివుని పాదారవిందమునకు యోగ్యమయినదో మరియు నేవిధముగా నందనారునకు ఇహలోక జీవనార్థమైయున్న వరిపొల మున్నూ తనకుతానే ఫలవంతమగుచుండెనో యదేవిధముగా తమ కులజులగు పూర్వీకులయొక్క ధర్మమును పరిపాలించుచు దైవానుగ్రహమును యర్థసంపత్తినిపొంది భక్తి, క్షమ, నమ్రిత, వీటిలోనెల్లరకు మార్గదర్శికులుగా యుండవలయును.

ఎల్లసమూహములలోనుండు స్త్రీలున్నూ, పురుషులు పరులనడవళ్లచే నొకసమయమందు సమయాచారములలో తొట్రుపడినను పూర్వకాలమందలి తిలకవతివలెను మంగయర్కరసివలెను

ఈశ్వరుని యందేకాగ్రముగా చిత్తమునిలిపి తమయొక్క భర్త, సోదరులు, బిడ్డలు వీరిని మంచిమార్గమునకు తేవలెను.

ఈవిధమయిన మనపెద్దల యొక్క సన్మార్గములచే మన మతము, సమూహము యంతకంతకు యభివృద్ధిజెంది క్షేమమును పొందవలెను.

## ౨
# విద్యాభ్యాస కాలమందు నలుపువిధులు.

స్వాములవారి యుపదేశము.

" వాగర్థావివ సంపృక్తౌ । వాగర్థప్రతిపత్తయే ॥
జగతఃపితరౌవన్దే । పార్వతీపరమేశ్వరౌ. "

ఎవ్వరైన నొకపూజ్యుడు మనయొక్క గృహమునకు దయ చేసెనేని, కుటుంబీకులందరున్నూ జేరి వారలకుపచరించుట పద్ధతి. మీరువేలమంది వకకుటుంబముగా నుండుటొకభాగ్యము. కవు లలో కాళిదాసు శ్రేష్ఠమయినవారు, వారు రఘువంశకావ్యా రంభములో, వాక్కు, అర్థమునై యున్న స్వరూపులై, ప్రపంచ మునకు మాతాపితృలైనటువంటి పార్వతీ పరమేశ్వరుల నమస్క రించుచున్నానని చెప్పియున్నారు.

శ్లోకము పైన నుదహరించబడినది.

ప్రపంచమునకు వారేతల్లితండ్రులని చెప్పబడుటచే లోక మెల్లను నొక కుటుంబముగా నేర్పడి యున్నది. ఆపెద్ద కుటుంబ

ములో యీ పాఠశాలోపాధ్యాయులున్నూ, పిల్లలున్నూ చేరి వకచిన్న కుటుంబము "శిశువుగా నున్నప్పుడే విద్యను జాగ్రతగా గ్రహించవలెను" యనికాళిదాసు చెప్పియున్నాడు.

విద్యకు రెండు యంగములున్నవి ఒకటి గురుభక్తి మరి యొకటి వినయము. కోపము ఖండనము మొదలైనవి విద్యాభ్యాస మందు పనికిరానివి. విద్యనుచదివి దానిని మరల ప్రయోగించు నప్పుడుకోపము మొదలయినవి కొన్నిసందర్భములలో నవసరమై యుండును. చిన్నవారుగా నున్నప్పుడు స్వతంత్రము, పెద్దల వాక్యముల మీరుట మొదలగునవికూడవు. మందుతినునప్పుడు పత్యముగా నుండవలెను. చదువున్నూ వకమందు పత్యమువల్లనే జ్వరము నివృత్తియగుచున్నది. మందున్నూ రెండవపక్షమైనదే పత్యమే ముఖ్యము చదువునకు పత్యమైనగురుభక్తియు వినయ మును యత్యావశ్యకములైనవి అడకువయున్నతి నిచ్చుననుటకు పాదధూళియే యొకయుదాహరణముగా చెప్పుచుందురు. పాద ములనుండి యెగిరి యదిమీదికి పోవుచున్నది. తాలిమి మనల మీది కెక్కించి విడుచునని ఆ వుదాహరణము తెలియజేయు చున్నది. శిశువుగా నున్నప్పుడు ఆచార్యానుగ్రహము పొంద వలెను. ఇప్పుడు తాలిమిగానుంటే పిమ్మట వున్నతి కలుగును. ఈ పాఠశాలలో ఆగుణమునిండి యున్నటుల తేలుచున్నది.

విద్యాభ్యాస సమయమందు, పిల్లలకు యితరపనులేమియు కూడవు. మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి మూడున్న యెడల యున్నతస్థితిస్వయముగనే రాగలదు. కొందరు యహంకారులై యుండుటకు కారణము, వారు మాతృభక్తి, పితృభక్తి, గురు భక్త్యాదులలో లోపించిన వారుగానుండుటయే. వారలయను గ్రహామునుపొందినవాడే వారికిస్వాధీనుడు. వేదముతరచు మాతృ భక్తి, పితృభక్తులను ఖండితముగా చెప్పుచున్నది. వివిధశాఖలు వివిధయుపనిషత్తులు వీనినే తెలుపుచున్నవి. అవ్వయారున్నూ (శారదాయవతారము) "తల్లియు తండ్రియు మొదటిదైవము" యనిచెప్పియున్నారు. వేదమున్నూ, అవ్వయారున్నూ, తల్లిని తండ్రిని దైవముగా భావించవలెనని చెప్పియుండుటచే దైవ మొకటియున్నదనుట నిశ్చయము, విద్యాభ్యాస మొకయోగము, చలించని చిత్తముతో దానిని నభ్యసించవలెను. విద్యాభ్యాస కాలమందు లోకకార్యములలో ప్రవేశించకూడదు; పరోప కారము చేయకూడదా, తనకుమాత్రమేచదువుట యనియడుగ వచ్చును పరోపకారమవశ్యము చేసితీరవలెను. దానికితగినవిద్యను నేర్చుకొనివెనకదానిలో ప్రవేశించవలెను. మూటలనుమోసి జీవ నముచేయు నొకడుజ్వరముచే భాధపడుచున్నాడు. అప్పటికిన్నీ మూటనుమోయ కొంతశక్తియున్నది. అయితే మూటనుమోసి ప్రయాసపడిన యెడల జ్వరము విశేషించును. అదియుండు

పర్యంతము విరామముగై కొని మాటనటుపై మోయుశక్తిని పొందవలెను. అటులనే విద్యాభ్యాసము లోకసేవకు పూర్వాంగము, లోకవిషయములను చెవినిడక యాచార్యభక్తిగలిగి విద్యను నేర్చినతదుపరి చక్కగా లోకసేవనుజరుపనవును. ఈ పాఠశాల పిల్లలు తమయొక్క నడతలవల్ల యితర పాఠశాలపిల్లలకు మంచి నడవడికలను చూపవలెను. వారలకు యుపదేశము చేయవలసినది లేదు అనుష్ఠానపూర్వకముగా చూపవలెను. ఈ పాఠశాలఆనందము కలిగించుచున్నదియని స్వాములవారుపన్యశించి విరమించిరి. వెనుక నుపాధ్యాయులకు కొన్నివార్తలచెప్పిరి.

చదివించుచున్నప్పుడే తాము ముందుచదివినది మననముచేయుటవశ్యమైయున్నందున నుపాధ్యాయులు మరల చదివినవారగుచున్నారు. పలువిధములైన జీవనముచేయవలసియున్నందున నుపాధ్యాయులే తాముచదివినవిద్యనే జీవనమునకు మార్గముగా నుపయోగించుచున్నారు, యితరులు చదువు ముగించినతోడనే వేరువేషములను ధరించవలసినవారుగాయున్నారు. తామునేర్పించబోవునది ముందుగనే యుపాధ్యాయులు చక్కగా పరిశీలించిన యెడల పిల్లలమదిలో చక్కగా నతుకునట్లు బోధించుశక్తి కలుగగలదు. వకవిద్వాంసుడు నొకరాజునొద్దకువెళ్లి తానుభాగవతమును చదువుదునని చెప్పినప్పుడు మరియొకపర్యాయము భాగవతము చదువుకొనిరమ్మని రాజుచెప్పెను. ఈవిధముగా వారిని వారు

యిరువై యొక్కతరి తిరుగగొట్టిరి. వారుకడసారి భాగవతము యొక్క యంతరంగమును తెలుసుకొని యాత్మలాభమునుకోరి వనమునకు వెళ్లిరి. అటులవారు పోవుటనుగనుగొన్న రాజు యితరుల కుపదేశముచేయుటకై యప్పుడువారు పక్వమైనారనితలచి వారి సన్నిధికివెళ్లి వారిని తనకుపదేశముచేయవలెనని ప్రార్థించి వెంట గొనివచ్చిరి. కనుక, చదువచదువ నంతర్భావము బయలుపడును అప్పుడుబోధించుటకు యోగ్యత వృద్ధిచెందును.

—o—

## 3 పుణ్యము – పాపము.

లోకములో మానవజన్మమునకే పాపపుణ్యములు యేర్పడి యున్నవి. మనము పాపమునుజేయుచున్నాము, పుణ్యమునుజేయు చున్నాము పుణ్యమునుకొన్ని సమయములలోనే జేయుచున్నాము. తఱచుగా మనోవాక్కాయములచే పాపమును జేయుచున్నాము. శరీరముచేజేయబడినదే పాపమనితలంచకూడదు మనస్సుచేతను న్నూ, వాక్కుచేతనున్నూ చెడుగుచేయుచున్నాము. వాక్కుచేత నిందించుట, యనృతమాడుట, యితరులనొప్పించునటుల కఠినము గామాట్లాడుట, యివియెల్లనుపాపములే. ఇవ్విధముగా నెల్లనుజే యుచున్నప్పటికిన్ని నిరంతరము పుణ్యమునే జేయవలయునని శా స్త్రముజెప్పుచున్నది. మనమున్నూ నవ్విధముగానే యిచ్ఛయించు

చున్నాము. తానుపాపమునుచేయ నిష్టపడునటుల కోటిజనులలో నొకడైనను జెప్పనేరడు. సత్యముగానడుచుకొని పరమాత్ముని యనుగ్రహముపొందుటకే ప్రతివాడున్నూ యాశపడుచున్నాడు. నరకమునకుపోవనొకడున్నూ యిష్టపడడు. అయితే నడవడివేరు విధముగాయున్నది. పాపమును ప్రబలముగాను, పుణ్యమును యల్పముగాను జేయుచున్నాము. మనజన్మములో పాపముజేయ నెంతకాలము పుణ్యముజేయ నెంతకాలము వ్రయపుచ్చినామని చూడగా మొదటిది పర్వతాకారమువలెను, వెనుకది యావగింజప్రమాణ పగిదియే యుండును. ఏదేశమందును, యేజాతియందును యిటులనే నున్నది. ప్రపంచమందెల్లను నిటులనే యున్నది.

కనుకనేమెచ్చుటను వ్యవహారములున్నూ, న్యాయస్థానములున్నూ, యపరిమితముగానున్నవి, ఎల్లరున్నూ సత్యముగానడచినయెడల వ్యవహారమేయుండదు, మనుజులలో చెడుతలంపులున్నూ, చేష్టలున్ను, యధికముగాయుండుటను, కోర్టులయొక్క సంఖ్యచూపించుచున్నది. ఇటువంటివ్యవహారములను తీర్చుటకు ప్రభుత్వమువారును విశేషధనము గ్రహించుచున్నారు. ప్రతివాదికి తనభాధ్యతను విడనాడినయెడల యెంతనష్టముకలుగునో, దానికన్నయధికముగా కోర్టుసెలవయి తీరుతున్నది. పూర్వము యిటులలేదు. అక్రమములు పెరుగుచుండబట్టి కోర్టులున్నుయథ

కమైపోవుచున్నవి. పూర్వముతప్పుచేసినవారేలేరని నేనుజెప్పుట లేను. తప్పుజేయువారు యెల్లకాలమందును గలరు. ఇప్పుడధిక ముగాయున్నారు. ఇట్టినడవడి యున్నను ఆశమాత్రముపుణ్యమం దేయున్నది. పాపమునుజేయ నొక్కరున్నా ఆశపడకుండినను నడవడి యక్రమముగానేయున్నది. మంచికార్యములు లోభించి యున్నవి. పూర్వపుఆలయములను కట్టినారు. ఈయరుగే యొకపుణ్యము. ఎవరైన విశ్రమించుటకు ఈయరుగే యాధార ముగాయున్నది. బంగళాకట్టి ద్వారముబంధించినయడల, నూత నముగావచ్చినవాడు పరుండుటకుస్థలము దొరుకనేరదు. మన యొక్క శిల్పిశాస్త్రమందే (యనగా గృహములు కట్టుట ఆలయములు నిర్మించు సిద్ధాంతములు, వివరించు శాస్త్రము ) పుణ్యమును నుద్దేశించి విధులు చెప్పబడి యున్నవి. యరుగు, యంగణము, వసార మొదలైనవి యనేకమైనను త్తమకార్యముల నుద్దేశించి చెప్పబడియున్నవి. వచ్చినవారికి యరుగుతావునొస గును. అసుచిగలవాడు యంగణమందు నుండును. లజ్జను యవ లంబించవలసినస్త్రీలు వేరుగానుండ, వారికి ప్రత్యేకగది యుండ వలెను. పాశ్చాత్యులకులజ్జ, యసుచి మొదలైనవిలేవు. వారిలో వొకొక్కడున్న ప్రత్యేకముగా ధర్మముజేయుటనులేదు. అనే కులుచేరి చందాచేసి యెద్దులశాలమొదలైనవి బెట్టుదురు. వారి వలె బంగళాకట్టినయెడల యాశౌచము లేదు, యసుచిన్ని లేదు.

అట్టిసమయమందు ధర్మము సాధ్యముకాదు. పదుగురు కూడి భుజించుటకు బంగళాలయందు వసతిలేదు. నలుగురు మేజాపై భుజించుటకే వారియొక్క శిల్పముద్దేశించినది. నవీనయేర్పాటులో మనయొక్క యనుష్ఠానమునకు హానికలుగుచున్నది. బంగళా కట్టినయెడల మొట్టమొదట యరుగుమాయమగుచున్నది. అరుగు యెల్లరకున్నూ అనుకూలమైనది మొదటపరులకు యేర్పరచిఆవల మనము వెదుకు కొనవలెను మనయాచారములలో నెల్ల నిట్టి వుద్దేశమేయుండుటచూడనౌను. భుజించుటకుపూర్వము కాకము నకుయన్నము పెట్టుచున్నాము. శునకమునకు వేయుచున్నాము ఆచారానుష్ఠానములందు యిట్టివారిట్టి స్థలమునకు రానౌను యిట్టి వారు రాకూడదనివిధిగలదు ( అయితే ) నూతనయేర్పాటులందది లేదు ఆచారము కఠినమైనదని చెప్పుచున్నారు. కాదు, హృద యములో దయతోనేశాస్త్రము విధులను చెప్పియున్నది. మనకు కారణము తెలియనందున నాచారములను విడిచిపెట్టకూడదు. ప్రస్తుతము కారణము తెలియకున్నను వాటిని కాపాడినయెడల ముందుకు కారణము తెలియునౌను. మనశాస్త్రములను విడిచిన యెడల ముందుకు దుఃఖమేర్పడును. మనుష్యులజన్మము వొక సుడిలాగునయున్నది గనుక శాస్త్రము " నీవుయోచనచేయ బోకు; మొకనితలపై యీ భారమునుమోపు " మనిచెప్పు చున్నది.. మనముమాట్లాడుచుండగ " వేదవాక్య " మంచుము.

వేదవాక్యము సత్యమనుట మనధృడ నిశ్చయము వేదము జెప్పి యున్న ప్రకారము నడిచినయెడల మనకువిచారముండదు. దేవుని యాజ్ఞానుసారము నడచినవారమైతిమని మనస్సునకు సంతుష్టి గలుగును. మనబుద్ధితో జేయుటకుమనము బృహస్పతికాము. శాస్త్రపద్ధతిగా నడుచుటకు దృఢభక్తి దానియందుండవలెను.

మృగములకు పుణ్యము పాపములేదు పశువులు దంతధావనముచేయకపోవుట దోషముగాదు. మనబాలుడు పండ్లుతోమని యెడల పిచ్చివాడందుము బుద్ధిగలమనుష్యునికే, పాపమున్నా, పుణ్యమున్నాగలదు. పశువుయొకనిని పొడిచిచంపివేసినయెడల, దానికిపాపములేదు మనుష్యుడు చంపినయెడల, పాపముగలదు. భక్తియున్నల్లైతే పాపము పుణ్యమునంటనేరదు దృఢభక్తిపొందు పర్యంతమే పుణ్యపాప వ్యత్యాసముగలదు భక్తినిశ్చలమును పొందినల్లైన, ఆశయుండదు. అట్టిభక్తి, శాస్త్రములో గలిగించవలెను. శబరియొకకిరాతస్త్రీ శ్రీరాములవారికి, మంచిఫలముల నివ్వవలయునను భక్తితో రుచిచూచి, మధురముగానున్నవి యెల్లను, వారికిగాను శేకరించినది కన్నప్పరు, స్వామిశిరమ్ముపై నోటిలోనుంచిన జలమును వుమిసినారు. మాంసమునునివేదనము చేసిరి ధరించిన పాదరక్షలతో పాదమును ముఖమందు కంటి సమీపమున గురుతుగా నుంచుకొనిరి మనమావిధముగా చేయ నవునా? ఎంగిలిఫలమును మనమునివేదనము చేయనౌనా, స్వామి

శిరస్స్నాన మనమునెంగిలి వుమియనవునా; భక్తివిశేషముచే చెడ్డ దనుతలంపువారియొక్క చిత్తమందు తోచదాయెను. భక్తివృద్ధి యైనయెడల చెడుగుచేయనిష్టముండనేరదు. ఎందుకుచెడ్డకార్యము చేయుచున్నాము ఆశయనునదేకారణము, పిమ్మట పశ్చాత్తాప మునుపొందు చున్నాము. పాపముజేయజేయనది సహజమైపోవు చున్నది. పాపమునకుకారణమైన ఆశనునిరశించి, భక్తినిదృఢముగా పట్టుపట్టవలెను. భక్తిచేతనే కృతార్థత పొందగలమని శాస్త్రములు జెప్పుచున్నవి. శాస్త్రమునందుచెప్పబడని విషయములలో మన బుద్ధినే నుపయోగించవచ్చును. శాస్త్రముజెప్పియుండు విషయము లయందు మనబుద్ధిని దూవలనుంచవలెను. దృష్టి, స్పర్శము మొద లైన నల్పకార్యముల యందునున్నా శాస్త్రవిదితముగా జేసిన యెడల యాత్మకు క్షేమము సిద్ధించును. ఇదియే మనపెద్దల యాజ్ఞ దానిని మీకెల్లరకు జెప్పునట్లు నాబోటివారిని నేర్పరిచిరి. ఈ విషయములపై యోచనజేసి నేనుజెప్పునది సరిఅని తోచిన యెడల, దానిని యనుష్ఠానమునకు తేగలరు.

—०—

## ౪. "భ్రాన్తినివారణమున కౌషధము."

కొన్నియాలయములందు, ఆదిశంకర భగవత్పాదాచార్య స్వాములవారి విగ్రహమున్నది. అదిచిన్ముద్రధరించినదై యున్నది.

పెద్దవ్రేలుయొక్క మొననున్నూ, చూపుడువ్రేలు కొననున్ను చేర్చిచూపునది చిన్ముద్రయనబడును. ఈ రెండు వ్రేళ్లలో చూపుడువ్రేలు భగవంతుని దెలుపుచున్నది, పెద్దవ్రేలు మనయాత్మను తెలుపుచున్నది. భగవంతునిస్వరూపము తప్ప వేరులేదనునదే చిన్ముద్రయొక్క అర్థము. ఒక్కటేయున్నదనిచెప్పునది చిన్ముద్ర చూపుచున్నది. మధ్వాచార్యులపఠమందు హస్తపురెండువ్రేళ్లను విడివిడిగానిలిపియున్నట్లు చూడనౌను. అదిద్వైతమును దెలుపుచున్నది. అద్వైతమునుదెలుపుచున్న చిన్ముద్రయేల నొకవ్రేలును చూపలేదు? ఏకమనిజూపవలెనంటే, నొక్కవ్రేలును జూపించియుండును. అయితే రెండుకాదని బోధించవలెను. వకవ్రేలుజూపినట్లైన నొకటియనియర్థమౌను. అయితేయద్వైతము యేదనగా రెండుకావని, జూపవలసియుండబట్టి రెండువ్రేళ్లనున్నూ జోడించి నొక్కటిగా జూపించి యున్నది. అద్వైతమనిన రెండు కానివి, రెండునునొకటిగా ముగియుననునదేయర్థము. అదియనగానారంభమునరెండు; అంత్యమున నొకటి, ఆచేరికకే యోగమని పేరు. చిన్ముద్రయనునది రెండువ్రేళ్లతో రెండుకావని తెలుపుచున్నది. పరమాత్మయని, జీవాత్మయని, యెల్లప్పుడురెండుగానేయుండునట్లుబోధించిన మధ్వాచార్యులు రెండువ్రేళ్లను జూపుచున్నారు.

చూడబడునది రెండుగాయుండుట మనము యొప్పుకొనకతీరదు. జగత్తుపలురూపములను గలదై యున్నది. లెక్కపెట్ట

అసాధ్యము. అయితే యివియన్నినొకటేయని మనశాస్త్రముజెప్పు చున్నది. సరిహద్దులేనిది యెల్లనునొకటిగానే యుండవలెనని జెప్పుటకునొకదృష్టాంతము జెప్పుచున్నారు. ఒకదర్పణమున్నది దాని యెదుటయింకొకదర్పణమును పెట్టుదుము. ఆయద్దమందుచూచి నయెడలప్రతిబింబములను లెక్కించనలవికాదు. సుమారు౫౦, లేక ౬౦బింబములవరకు మనముచూడనౌను. ఇంకనుయెన్నియోయుం డును. వాటినిచూచుటకైననుమనకుశక్తిలేదు. అదియేయనంతము. (అంతములేనిది) అనంతమైనవాటిలో పరమాత్మయొకరు. వారి కిన్ని యనంతుడనుపేరుగలదు. సరిహద్దులేనివారనియర్థము. ఆకాశ మెన్నిమైళ్లదూరమున్నదిహద్దులేదు. హద్దులేని యాకాశమునకు దేశమనిపేరు. కాలమును, దేశమును హద్దులేనివి. ఇటులయనం తముగా వుండునది వాస్తవముగానుండక చూపునకే యున్నది. అనంతముగా ప్రతిఫలించినది యొకదర్పణమే. ఒకటిగాయున్న వస్తువు యనేకముగా తోచుచున్నది. యెదటయుంచిన దర్పణము నుతీసినయెడల యాధారమైనయద్దము నొక్కటేబాకి యుండును. వస్తువులు లెక్కలేనివిగాతోచినను యన్నియు నొక్కటియేయని నీదృష్టాంతము చూపుచున్నది.

అయితే రెండులేవని చెప్పుచున్నను, మనదేశమందుననే, రెండుగానుండుట బలముగానున్నది. ఇతరదేశములలో యాహా రము విహారము నడత పోషణ భావనలు స్పర్శము మొదలైన

విషయములందు భేదములేదు. కూడికూర్చుని భుజించుచున్నారు. ఒకరినొకరు ముట్టుకొనుచున్నారు. మనలో నొకజాతివాడు నొక జాతివానిని ముట్టుకున్నయెడ తక్షణమేస్నానము చేయుచున్నాడు. వేరు, వేరుజాతివారు కలసిభుజించ కూడదు. అశుచిగలవాడుముట్ట కూడదు. శ్రాద్ధకాలము పూజాకాలము మొదలైన సమయము లలో యితరుడెవడున్నూ స్పృశించ కూడదు. ఆలయములలో పూజారియే గర్భగృహమందు పోగలడు.

ఇతర బ్రాహ్మలున్నూ దానికివెలుపలనే నిలవ వలయును. ఇట్టిభేదములనంతముగా యున్నవి. పాశ్చాత్యులలో నట్లు, లేవు. ఇట్లుంతావారిలో భేదములేనప్పటికిన్ని వొక్కరొక్కరి లోనుయ యసూయ అధికముగాయున్నది. జర్మనివారిపై ఫ్రెంచివారికసూయ ఫ్రెంచివారిపై యిటలి వారికసూయ. మనము యెటులున్నా మన ఒకగ్రామమునకున్నూ ప్రక్కనుండు గ్రామమునకున్నూ కాల్వ వ్యవహార వ్యాజ్యముండునట్లు తలంచుతాము. ఆయాగ్రామము లలోపలువిధమైన జాతులవారుయున్నారు. అయితేఅందరికిసంబం దించిన విషయమందు యందరుయేకముగా జేరుకొని ప్రక్కగ్రా మమునకుపోవుట సర్వసాధారముగా నున్నది. వ్యత్యాసములనే కములున్నను మనస్సునందైక్యమున్నది. మనస్సులో వ్యత్యాసము లేదు. ఒకబ్రాహ్మణుడొక వైశ్యునియొక్క గృహమునకు భోజ నమునకు పోయినయెడల యాగ్రామమందుండొక బ్రాహ్మణుని

గృహమునకు యతనినిపంపి యావైశ్యుడు భోజనసదుపాయములు జేయుచున్నాడు. నేటివరకున్ను యిట్టి యైకత్వముసాధారణముగా జరుగుచున్నది. పాశ్చాత్య దేశస్థులలో, కూడిభుజించినప్పటికెన్ని వివాహమునకు యభ్యంతరము లేకపోయినను, మనోయైక్య ముండదు. మనలోయింతద్వైతమందు యద్వైతమున్నది. అద్వైతముఅనుపదము జీవబ్రహ్మైక్యమే జెప్పుచున్నదైనను ఆపదమును యీసందర్భములో నుపయోగించుచున్నాను. ఇతరదేశములలో ముట్టుకొనుటమొదలగు కార్యములలో భేదములేదు. మనస్సునందే భేదము.

ఇవియన్ని యునిలిపి నికయద్వైతము గమనించెదము.

లోకమెల్లను పరమాత్మయేయని శాస్త్రము జెప్పుచున్నది. మనమే పరమాత్మయని జెప్పుటయొక యహంభావముకాదా? ఇతరమతములలో భగవంతుని యనుగ్రహము ప్రార్థింపబడుచున్నది. మనముయెల్లరమే స్వామియనునది, యుచితముగాలేదని కొందరుజెప్పుచున్నారు. ఆయితేశాస్త్రముయేమి జెప్పుచున్నది? పరమాత్మయే యెల్లెడనిండియున్నారు. అతనుతప్ప వేరులేదని శాస్త్రము జెప్పుచున్నది. వారుతప్పవేరొకటి యున్నయెడల, పలు వస్తువులయందు వారొకటియైపోవుదురు. సమస్తమువారేయైన యెడల మనముమాత్రము వేరుగానుండుటకులేదు. అయితేమనము అను నొకటితోచుచున్నది. దానినిన్నీ పరమాత్మ స్వరూపములో

కలిపివేయవలెను. మనపై శిశువుప్రీతిగాయున్నది. అది క్షేమముగా యున్న యెడల మనగతియెటులనేని కానిమ్మని యెంచుచున్నాము. అటులనే యామంగళస్వరూపమువుండెనేనిచాలును. దానిలోదీనిని కలిపివేయవలెను. మనము యనుట వేరుగాలేకపోవుటయే యద్వైతము. రజ్జును సర్పమనియెంచితిమి. సర్పముకాదని తెలిసినప్పుడు రజ్జువే యున్నది. ఆవిధముగానె మనములేనియెడల నుండునది పరమాత్మయే. అద్వైతమందహమనుభావము తొలగుచున్నది. మనముయనునది మాయమౌతున్నది. సర్వమున్నూ పరమాత్మమయమౌచున్నది. తొలగనిదానిలో తొలగదగినదెల్లను తొలిగిపోవుచున్నది. వారే విష్ణు, శివుడు పరమాత్మ, యిదియే యద్వైతము.

ఆవిధమైనచో మనముయేమిచేయవలెను. దేహమునుమనమని తలంచుకొనియున్నాము. గోరునుతీసివేశినయెడల నదివేరైపోతుంది. వెంట్రుకలు, మాంసము, మొదలైనవి యవ్విధముగనే అవిమనముగా తోచుచున్నది. మనముకానివస్తువును మనమనియెంచుకొనియుండు తలంపుపోవలెను. పరమాత్మయే నిజమగు మనము. దేహము మనమనియెడి భావన పోవలెను. మనస్సువానరము; వేరనొకటియిచ్చినయడలనే నదిచేతిలోనున్నదానిని విడుచును. ఈ శరీరముకుల్లినది ఇట్టియాభ్యాసమును మనమనిమనస్సు తలంచుకొనియున్నది. మనముపరమాత్మయని యడితలంచునట్లు

చేయవలెను. యథార్థమైనచో మనమనువస్తువు శస్త్రముతో ఖండించినయెడల ఖండింపబడదు. యగ్నిలోవేశినయెడల తగులబడదు. జలములో కుళ్లదు. ఆవస్తువును మనమని తలంచుకొనవలెను. రుచిగల కదళీఫలమును వానరమునకు యిచ్చినయెడల చేతిలోనికుళ్లిన ఫలము నదివిసర్జించివేయును. మధురమైనది పరమాత్మవస్తువే. ఆ రుచిగనినయెడల ధర్మమును మాత్రము జేయవలెనని తోచును. అప్పుడు శరీరయభిమానముపోవును. అనేకపెద్దలు; కొన్నివర్షములు ధ్యాననిష్ఠలోవుండినట్లు మనమువినుచున్నాము. ఆ తత్వమును కనుగొనవలెను. ఎల్లవస్తువులున్ను మనమనితలంచుకోవలెను. అహము పోయినప్పుడు, యహంభావమును పోవును. అహం యనగా నేను యనునర్థము. దానికై, భగవంతునకు, మనకాలమునునర్పించవలెను. వారిని ధ్యానించవలెను. మనసంపత్తిన్ని నర్పించవలెను. అయితే కొందరు యీవిషయమై యాక్షేపించు చున్నారు. దేవస్థానములలో నభిషేకముజేయు పాలుమొదలైనవి నష్టమవుతున్నవి యనుచున్నారు. కడుపులోపోయినయెడల, నాకలిశమించునని యనుచున్నారు. మనముభగవంతుడను తలంపుపొందినయెడల, యివియెల్లనష్టమనితోచదు. కొందరుస్నేహితులు, తమ శరీరములు వేరైనను, ప్రాణమొకటని యనుచున్నారు. శిశువుకు యసౌఖ్యము వచ్చినయెడల మనము, నిద్రను లక్ష్యముచేయుదుమా? ద్రవ్యమును లక్ష్యము చేయుదుమా? వకరియందు ప్రియ

మున్నచో సమస్తవస్తువులున్నూ వారికర్పణ జేయుచున్నాము. స్వామికి వస్తువులనభిషేకముజేసి యెందుకు వ్యర్థబుచ్చుటయని దలంచినప్పుడు ద్రవ్యముగొప్పయని దలంచుచున్నాము. వాస్తవమైన ప్రేమయుండుటకు నిదర్శనము, తనయొక్క ద్రవ్యమును యర్పణజేయుటే. శిశువునకు యెందుకు సెలవుజేయుదుమనినొకరు చెప్పిన, నదితండ్రిచెవునబడదు. భక్తి ముక్తికి పూర్వాంగము. మన దేహము, జీవితకాలము, ద్రవ్యమైనవీటిని భగవంతునికి యర్పణ చేయవలెను. ఆళ్వారులున్నూ ( వైష్ణవాచార్యులు )నాయనారులున్నూ ( శివభక్తాగ్రేసరులు ) యటులనే జేసినవారు. ద్రవ్యమును యర్పణజేయవలయునని, దలంపువచ్చినట్లాయనా యది నష్టమవునను తలంపువుండదు. ద్రవ్యముగొప్పయని తలంచువరకు నీడుకడ తేరలేదు. పూర్వము తాామున్నూ సుఖజీవులై యుండి దేవాలయములు నిర్మించినారు. దేవాలయములు కట్టినందులకు కారణము ద్రవ్యముకన్నను భగవంతుని గొప్పగాతలంచుటే. శిల్పులతమయొక్క విద్యాచాతుర్యమును తమగృహములలో యుపయోగపర్చరైరి. దేవాలయములలో నుపయోగించిరి. కవీశ్వరులున్ను యవ్విధముగనేజేసిరి. ద్రవ్యవంతులు దేవాలయముగట్టిరి. భగవంతునికిదానిచే లాభములేదు. కట్టినవాడు కృతార్థుడాయెను. లోకమునకున్నూ మార్గముచూపిన వాడాయెను. భగవంతునికి సమస్తముయర్పణ చేయవలెను. దానిలో నొకభాగము ధర్మము

చేయవలెను. ఇప్పుడు వారివారి సంపాదన వారివారి సెలవులకే చాలకున్నది. కాన వకధర్మమున్నూ సాధ్యము కాకయున్నది. పూర్వము యధేష్టముగా ధర్మము చేయుచూవచ్చిరి. ఇప్పటికిన్ని నాటికోటిశెట్లు జేయుచున్నారు. ఎంతగాసంపాదించినను కష్టము కలుగుచున్నది. దానముజేసిన ద్రవ్యమున్నయెడల భుజించగలమే యని తోచుచున్నది. అదినివ్వకుండినయెడలనదియును పోయియుండును. లోకమెల్లను నేకమైనందున నీవిధమాయెను. పూర్వము 50 సంవత్సరములకు నొక క్షామము. ఇప్పుడు లోకమెల్లెడలను నిత్యముకరువు. అయినను సాధ్యమైనంతవరకు భగవంతునకు నర్పణ జేయవలెను. అదియే పరమలాభము. ద్రవ్యము, దేహము, చిత్తము, వాక్కు వీటిని నివ్వవలెను. ఈసంమేళముండినట్లైన యెంత భేదముండినను ఆంతరంగిక ప్రేమయుండును. ద్రవ్యము వెలుపలి ప్రాణము. బాహ్యసంచారము జేయునదియది. దానినిన్నీ యివ్వవలెను.

నిత్యము 5 నిమిషములు భగవన్నామస్మరణ జేయుడీ! ఒక స్వల్పధర్మము చేయుడు. ఒక్కొక్కరును స్వల్పముగా ధర్మము చేతురేని లోకమునందనేకజనుల కష్టమునివారణమౌను. వేల కొలదిజనులు చేరనవసరములేదు. ద్రవ్యముతోను భగవంతుని కైంకర్యము చేయవలెను.

—o—

# ౫. చతుర్విధ పురుషార్థములు.

## ధర్మార్థ కామ మోక్షములు.

మనపెద్దలు మనముపొందవలసిన కోర్కెలు నాల్గువిధములుగా విభాగించబడియున్నవని చెప్పియున్నారు. వాటిని ధర్మము, యర్థము, కామము, మోక్షమని చెప్పనౌను. నాల్గునకున్నూ సంస్కృతమందు పురుషార్థములు యనిపేరు. పురుషార్థమన పురుషులవల్లననగా మనుష్యులవల్ల కోరబడినదియని యర్థము. ఈ నాల్గున్నూ పురుషులవల్లయెందుచే కోరబడుచున్నవో గమనించెదము. కొన్నివీధులలో జనులకూటమున్నూ బండ్లకూటమున్నూ యధికముగా నుండును. అనేక గ్రామవాసులు చేరియుందురు. ఎందుకుగాను ? తమకుకావలసిన నొకకార్యమునకు. వారలుకోరునది అర్థము యనగా ధనము, వుద్యోగము, వ్యాపారము మొదలగుపనులతో వారుకూడియున్నను లక్ష్యముధనమే. అదిమనుజులవల్లకోరబడినది. అటులనే మరిమూడున్నూ కోరబడినవియే. ద్రవ్యము సంపాదించుట కష్టము. సంపాదించు కాలమందుసుఖములేదు. నిద్రలేకను, ఆహారములేకను, మానావమానములులేకను సంపాదించుచున్నారు. కాన ధనమందాశ యధికమున్నది.

సాయంసమయమందు సముద్రతీరమున పోవుచున్నారు. ధనముకొరకుగాదు, విలాసార్థమై వెళ్లుచున్నారు. అదిన్ని యొకపురు

షార్థము. తిరుపతి కొండపై రేయింబగలు 56 దేశప్రజలను చూడ నగును. అచ్చటికిధర్మనిమిత్తమై పోవుచున్నారు. తిరువల్లవ నాయ నారుమొదలగు యనేకపెద్దలు శైవులైనను వైదికమతమును యనుసరించినవారే. వారుయేభాషలో వ్రాశియున్నను పురుషార్థ ములను నాల్గువిధములుగా విభజించియున్నారు. తిరుపతికి సెలవు చేసుకొనుచు, కష్టబడుచుపోవుట ధర్మనిమిత్తమని చెప్పితిని. తిరు వణ్ణామలయిలో శేషాద్రి స్వాములను నొక మహనీయులుండిరి. ఇప్పుడు రమణస్వాములున్నారు. కాశియందు భాస్కరానందు లనునొకపెద్దలుయుండిరి. కుంభకోణమందు మౌనస్వాములుండిరి. వారు రెప్పవాల్చినది లేదు, నిద్రించినది లేదు, చెలించినది లేదు. భక్తు లుకొన్ని యాహారములను నోటియందుంచుదురు. రెండుమూడు దినములు యచ్చటనే నదియుండును. వెనుక దానిని తీసివైచి నోటిని శుభ్రపరచి వేరుయహారము నుంచుదురు. ఇటువంటివారు మోక్షపదవిని పొందినవారు. తమకునునది కావలయునని యాశ పొంది మనుష్యులు వారియెడల భక్తి జేయుచున్నారు. పూర్వము 1008 శివాలయములుండెను. ఇప్పుడు సుమారు 200లు వున్నవి. వాటిదర్శనార్థమై యాత్రపోవుచున్నారు. మోక్షేచ్ఛయే దానికి కారణము. నాటకశాలలు, వస్తుప్రదర్శనములు, మొదలయిన స్థళములకుపోవుట విలాసార్థమునకు. అచ్చట యనుభవించువిలా సము తత్క్షణమే మాయమౌను. పెద్దలసేవ, నూతినిర్మాణము,

దానధర్మముజేయుట మొదలయినవి ధర్మము. ఆత్మనిష్ఠ, యోగ ముమొదలగునవి మోక్షమునకు సాధనములు. ఇతరమతములలో పురుషార్థములను నిట్లువిభజించలేదు. బౌద్ధముమొదలగు వానిలో పురుషార్థము లిట్లువిభాగింపబడలేదు. ఇటువంటి పురుషార్థము లలో యెల్లరు వొప్పుకొనవలసినవి ద్రవ్యమున్ను విలాసము. వాటి నక్కరలేదని చెప్పువారులేరు. ధర్మమున్ను మోక్షమున్ను కొందరొప్పుకొందురు. కొందరొప్పుకొనరు. 20 యేండ్లకుపై 40 యేండ్లవరకు ధర్మమందుప్రవృత్తి వుండదు. 18 యేండ్లలోపుగా నున్నవారు ఆలయమునకు పోవలెననియిష్టపడుదురు. దానికి కార ణము తల్లియెడల యుండుప్రేమ. తల్లులకు ధర్మమందు ప్రేమయధి కము. వారితోకూడి యుండునెడల, చిన్నపిల్లలుగా యుండు నప్పుడు దేవునియెడల భయభక్తియున్ను పెద్దలయెడ గౌరమున్ను యుండును.

16 యేండ్లు వచ్చినయెడల తనకొమారుడైనను స్నేహితుని గా భావించవలెను. అనగా వారినియధికారము చేయకూడదు. 16 యేండ్లురాగానే వారలుయాలోచించ యారంభింతురు. తల్లి తండ్రులనెడప్రేమ కొద్దికొద్దిగాతగ్గును. దూడలున్ననటులనే, 16 యేండ్లుమొదలుకొని కన్నవారిపై ప్రీతికొద్దికొద్దిగాతగ్గును. కర్తృ త్వమేగొప్పగా తోచును. ధర్మమందును మోక్షమందును యాశ యుండదు. 16 యేండ్లవయస్సుకుముందు భక్తియుండును. 50

లేక 60 ఏండ్లకుపై వారు దేవాలయమక్కరలేదు, దేవుడక్కర లేదని జెప్పరు. 16 యేండ్లకులోపుగా నుండుపిల్లలకు మోక్షమందు ప్రీతియుండదు, ధర్మయందే ప్రీతియుండును. వయస్సుచెల్లినప్పుడే యనుభవమువల్ల జ్ఞానముకలుగును. ఈశ్వరతత్వజ్ఞానము, భక్తి, మొదలైనవి పుస్తకము జదువుటవల్ల కలుగదు. పూర్ణయనుభవమువల్లనే గలుగును. అనుభవమువల్ల సంచలనము వీడితెలివి యేర్పడును. ఒకయుదాహరణము గమనించెదము. రామేశ్వరమందు శ్రీ రాములవారు నిర్మించినసేతువు 20 మైళ్లపొడవున్నది. రెండువైపుల సముద్రము ఉత్తరసముద్రమందు తులామాసము మొదలు తరంగములువిశేషము. దక్షిణసముద్రమందు దక్షిణదిశ నుండి గాలివీచునప్పుడు యలలువిశేషము. కొన్నిమాసములలో ఉత్తరసముద్రము తటాకము పగిదియుండును. దానిలో తరంగములుదొర్లుట యణగుటయనునటుల మనమనస్సు యొక్కతరంగములుదొర్లును. ధనమునకున్నూ విలాసమునకున్నూ కాలమైన 16 యేండ్లవయస్సుమొదలు 50 యేండ్లవయస్సు పర్యంతము గొప్ప తరంగములూగుచు ననుభవముపొంది యటుపై శాంతియేర్పడును. బాల్యమందును దేహమసౌఖ్యమైన యెడల దైవమును ప్రార్థించుకొనును. అటుపై యోగ్యుడుగా యుండుటకై ప్రతిజ్ఞజేసుకొనును. అయితేదేహము సౌఖ్యమైన పిమ్మట పూర్వమువలె నడచుట కారంభము జేయగలడు. ఈతరంగములవల్ల యోపిక

యున్నూ, శాంతియున్నూ యేర్పడదు. రామేశ్వరమందు అగ్ని తీర్థమనునది సముద్రములో నొకభాగము. అచ్చటతరంగములు లేవు. యటుగునుండు కాతుకనబడును. ఆవిధముగామనసుశాంత మొందిననే బుద్ధి తేటపడును. వినయము తెలివినిచ్చును. క్రోధసమయమున తెలివియుండనేరదు. వయస్సుముదిరిన కాలమందు వినయము గౌరవమువచ్చును. అప్పుడున్ను కొందరికేకలుగును. మాతృభక్తి, పితృభక్తి, ఆచార్యభక్తి గలవారలకు నవిగలుగునని శాస్త్రము జెప్పుచున్నది. ఒకపెద్దలువచ్చినట్లు ననుకుంటాము వారియొక్క గుణము ఆశ్చర్యముగానుండెను. తల్లి తండ్రి గురువు ముప్పురున్ను గలవారివలె మీరుయున్నారని వారినిజూచి యొకరుజెప్పిరి. తల్లి ఆజ్ఞానుసారము, తండ్రిఆజ్ఞానుసారము, గుర్వాజ్ఞానుసారము నడుచుచు వచ్చినవారు గుణమందు శ్రేష్ఠులగుదురని తాత్పర్యము. ఎట్టివానికైన నొకగురువుండియుండే తీరవలెను. ఎవ్వరైనను స్వల్పముగ జ్ఞానమును ప్రవేశింప జేసియుందురు. తల్లితండ్రులు యెల్లరకును గలరు. ఆవిధమైనగురువును తల్లి తండ్రిని గల వాకొక్కడున్ను గుణమందు శ్రేష్ఠుడనుటపొసగదు. తల్లి తండ్రి గురువు గలిగియున్న మాత్రముజాలదు. తల్లివల్ల మొదటి సన్మార్గమం దలవాటుపడివెనుక తండ్రికి నొప్పగించబడి వారివల్ల సన్మార్గ మందలవాటుబడి సద్గురునియొద నొప్పగించబడి వారివల్ల నేర్పింపబడవలెను.

ఈకాలమందు తల్లితండ్రులశిక్షయేలేదు. చిన్నవయస్సుననే చదువుటకు పిల్లలను వేరుస్థళములకు పంపుచున్నారు. గురుని యెడభక్తిలేదు. యుపాధ్యాయులు వేతనముగొనుటచేత సేవకుల వలెపిల్లలువారిని భావించుచున్నారు. పూర్వము గురుభక్తి యధికముగానుండెను. ఏశాస్త్రమభ్యశించిన వారలున్ను గురుసేవ జేసియుండిరి. ఈకాలమందు, నవియన్నియుపోయి గౌరవము లేక, తాను తలంచినదియే సరియనుతలంపు గలుగుచున్నది. అనుభవజ్ఞులనడిగి తెలుసుకొందుమను తలంపు గలుగవలెను. అట్లు తెలుసుకొను మార్గములలో నొకటి వాదమనబడును. వాదము, మొదలైన మూడుమార్గములకు మొత్తముగా, కథయని పేరు; వాదము, జల్పము, వితండమనునవి. మనకు తెలియని నొక విషయమును తెలుసుకొనుటకై పరులతోమాట్లాడుట వాదము. ఈ కాలమునందు యదియపార్థముగా యుపయోగింప బడుచున్నది. జల్పమనునది యితరులుజెప్పునది దప్పిదమనిజూపి తాను జెప్పునదె సిద్ధాంత పరుచుచున్నది. వితండమనునది యితరులేది చెప్పినను అదితప్పుయని జూపుటకు చెప్పునది. అదిపాపమైన కార్యము. అనుభవమైనది వయస్సుముదిరినవారికే యేర్పడదగినది. ఆకాలమందుననే తెలివియేర్పడును. యటుల తెలివిగలిగిన వారుసద్విషయములను బాలులకుబోధింతురు. ఇప్పుడునటువంటి పద్ధతులు మిక్కిలితగ్గిపోయినవి. దేవాలయములకు పోవువారికన్న

సముద్రతీరముకు పోవువారేయధికము. వయస్సుమీరినను, సద్వి షయములలో ప్రవర్తించువారు తగ్గుతునే యున్నారు. కనుక ధర్మముండుటకు స్థానములేక తత్తరించుచున్నది.

మోక్షమనునది ఈశ్వర చరణములను నందుకొనుట. ధర్మ మందును, మోక్షమందును ,ప్రీతియనుభవముచే గలుగును. అర్థ మందును, కామమందును పిన్నతనమందు ప్రీతిగలుగును. మను ష్యులు, ధర్మార్థకామమోక్షములునాలుగున్నూ యొక్కొక్క దశయందుకోరు చున్నారు. అర్థమున్ను, కామమునక్కరలేదనివిడి చినయెడల, ధర్మము సాధ్యము కానేరదు. ధర్మము లేనియెడల మోక్షము దుర్లభమైనది. కాన, ధనము ముఖ్యమగుటచేతనే, " తరంగములచే కూడిన సముద్రమును దాటుచు ద్రవ్యమును వెదుకు " యనుచుజెప్పిరి. ఇట్లుజెప్పుట వైశ్యులనుద్దేసించే, వొక్కొక్క వర్ణమునకున్నూ నొక్కొక్క వృత్తిముఖ్యము. బ్రాహ్మణులు కర్మానుష్ఠానములలో తప్పకూడదు. కర్మానుష్ఠా నములు మోక్షయిచ్ఛను గలుగజేయును. మోక్షమందు ప్రీతి గలవారున్ను, ధనమును, కామమును, నిరాదరణ చేయకూడదు. వాటిని, వుదాసీనముజేసిన యెడల ప్రపంచము నిందించును. లోక నింద, ధర్మము జేయుట సాధ్యముకాకుండా చేయును. కనుక, ధర్మార్థ కామమోక్షమను నాలుగే ముఖ్యము. నాలుగింటిలో శ్రేష్ఠమైనది మోక్షము. దానికి నాధారము ధర్మము, దానికి

యవశ్యము ధనము యదివిలాసమునిచ్చును. పురుషార్థములలో శ్రేష్ఠమైనమోక్షము, కరుణానిధియైన ఇందుశేఖరుని యనుగ్రహమువల్ల గలుగును. మనము బైటతిరుగు నప్పుడున్నూ మన గృహవిషయమైన తలంపే యున్నవారమయి యున్నాము. అటులనే, నేపనిజేసినను మోక్షమయిన యింటిని తలచుచుంటిమేని యదిగలుగును. ఈశ్వరచరణమే మనలనుగట్టుజేర్చును. దానిని పట్టుకొనవలెనని దలంచుచున్నాను. నేనుజెప్పునది యుచితమైన దాయని యోచించి, యుచితమని తోచినయెడల యనేక నిర్బంధ కార్యములున్నప్పటికిన్ని భగవంతుని ధ్యానించుడు.

—o—

## ౬. "హరనామము పరివేష్టించుగాక!"

మనయొక్క మతస్థులు సంగముగా కూడియున్నసమయమందు పలుగురు మాట్లాడుటవల్ల శబ్దము నిండియున్నయెడల మౌనమునుగలుగజేయుటకొక సులభమైనమార్గము యున్నది. సంఘమధికము; సంభాషణముతోనిండియున్నది; ఇందులోవొకరుజెప్పునది యెల్లరువినునట్లు జేయవలెను; అట్టిసమయములో "హరహర మహాదేవ" యని వొకరు కంఠమెత్తిజెప్పిన యెల్లరున్ను దానినే ఉచ్చరించుదురు. అప్పుడు భాషణము నిలిచిపోవును. ఆసమయమందు, వారికినేదో జెప్పదొడగినవారు జెప్ప

బూనినాను. "హరహర మహాదేవ" యను నామావళి జనులనే కము జేయుచున్నది. దేశము నొకటిగా జేయుటకును నదియేమార్గ ము లోకము నైక్యముజేయుటకుకూడ నదియేమార్గము. లోక మందుధనికులకున్నూ, కార్మికులకున్నూ, పరస్పరవిరుద్ధము యేర్ప డిపోవుచున్నది. రాజ్యాంగమునకున్నూ, ప్రజలకున్ను మనస్తాపమే ర్పడుచున్నది. పెద్దవారికిన్ని, చిన్నవారికిన్ని పోరాటము. ధని కులకున్నూ, బీదలకున్నూ పోరాటము. వొకజాతికి నింకొకజాతికి ద్వేషము. వొకమతమున కింకొకమతమునకు ద్వేషము. ఇట్లెల్ల పరస్పరవిరోధము లేకయుండుటకే యెల్లరు గూశపడుచున్నారు. సంఘములో యమరికగానుండుటకే నొక్కొక్కడున్నూ ఇష్టపడు చున్నాడు. అయితే నొక్కొక్కడున్నూ ప్రక్కనుండువానిని పొడుచుచున్నాడు. మాట్లాడబోకని కేకవేయుచున్నాడు. అం దరువేయుకేకలు వురుము వురిమినట్లగుచున్నవి. అట్టిసమయమం దు నొకనామావళి సరియగు స్థితిని గలిగించుచున్నది. లోకవ్యవ హారమందును భగవంతునియెడ భక్తి కలిగినట్లైన వానియందు భక్తిగలిగిన నితరులయందును ప్రీతిగలుగును. అప్పుడుమాత్సర్య మేర్పడనేరదు. కనుక లోకకష్టలనిర్మూలించుటకు భక్తి గలుగు నటుల నుపదేశముచేయవలెను. పెద్దకలకలధ్వనిని పోగొట్టి నిశ్శ [illegible]ప్పిన యీ "హరహర మహాదేవ" యనుదానిని మనకునెవరునేర్పించిరి ? మనతలిదండ్రులుకారు. పారంపర్యముగా

యదివచ్చుచున్నది. ప్రపంచమందు హరనామ శబ్దమునిండిన యెడల ద్వేషముతొలగిపోవును. హరునిభక్తిసలిపి మోక్షము పొందిన 63 శివభక్తులయొక్క విగ్రహములను శివాలయములలో చూచుచున్నాము. వారిని దర్శించినచో మనకును శివప్రసాదము ను కలుగుటకు కారణమైనభక్తి కలుగుగాక యని విగ్రహముల ను స్థాపించియున్నారు. శివభక్తులలో నలుగురు సమయాచారులని చెప్పబడుచున్నారు. వారిలో నొకరు అప్పరు. వాగీశ్వరులని సంస్కృతమున వారికి నామము, అనగా వాక్కునకుప్రభువు. సుందరులు నొకరు, సంబంధరులునొకరు, మణివాచకపెరుమాళ్ యను మాణిక్కవాచికర్ నొకరు. సంబంధస్వామి నొకసమయమందు నొక "స్వస్తిదశకము" గానముచేసిరి. నాయన్నారుల విగ్రహ ములలో చిన్నబాలునివలె కరమునందు తాళముంచుకొనియున్న వారే సంబంధస్వాములు. 16 సంవత్సరములే వారు యీప్రపం చమందుండిరి. జగదంబయొక్క స్తన్యపానముచే జ్ఞానముయొక్క సంబంధముపొంది తక్షణమే "తోడుడయ సెవియన్" యను దశకమును పాడిరి. పరమేశ్వరుడే వారికి సువర్ణతాళము నిచ్చిరి. సువర్ణతాళముధరించినవారి యాలయమని సీర్ కాళిలోయున్నది. సువర్ణతాళమందు ధ్వనిపూర్తిగా నుండనందున దానిలో ధ్వని పూర్తిగానుండునట్లు యంబిక యనుగ్రహమొసగెను. కాన దేవికి నచట శబ్దనాయకి యనునామము వాడబడుచున్నది. ఈశ్వరుని

వద్దనుంచి వారుముత్యముల పల్లకినిపొందిరి. కుంభకోణమునకు దక్షిణమందున్న పటీశ్వరమను క్షేత్రమందు ముత్యపుపల్లకిలో సంబంధ స్వాములను, పరమేశ్వరుడు నెదుట ప్రత్యక్షముగా చూచుటకు, ధ్వజస్తంభమున్ను, నందికేశ్వరుడున్నూ, సన్నిధికి నెదుటనుండకుండా ప్రక్కగాజరిగి యున్నవి. ఇప్పటికిన్ని ఆ క్షేత్ర మందు ముత్యపుమండప యుత్సవము కొనియాడబడుచున్నది. నేటికిన్ని వారిపేరు జెప్పుకొని తేవారము గానము జేయబడు చున్నది. ఈనగరములో వేలకొలది వైశ్యులునొక "తేవార" గానశాలచక్కగా నడిపించుచుండుట సంతోషముగానున్నది. ఈ తిరుజ్ఞానసంబంధ రొకసమయమందు మధురకుపోయి పాండియ దేశమును జైనమతమునుంచి కాపాడవలసిన నక్కర యేర్పడెను. పాండియరాజు జైనులమతమును నవలంబించినాడు. జైనులువేద మున్ను వైదిక యనుష్ఠానములున్నూ నిరాకరించినవారు. వారికి వశమైపోయిన రాజు, దేవాలయములకు జనులు వెళ్లకూడదు వీభూతి రుద్రాక్షలు ధరించకూడదని యాజ్ఞయిచ్చినాడు. రాజు యొక్క పట్టమహిషియైన, మంగయర్కరశియున్ను, ప్రధాని కులచ్చిరయారున్ను, మహాశివభక్తులు. రాజుతెలుసుకొనక వారు విభూతి రుద్రాక్షలు ధరించుకొని శివభక్తిచేసుకొని యుండిరి. ఈ మంగయర్కరసియారు 63 శివభక్తులలోనొకరు. స్త్రీభక్తులలో కారక్కాల్ యమ్మవారున్ను నొక్కరు. వారుపాడి యుండు

దశకములలో తనను కారక్కాల్ పిశాచమని జెప్పుకొనుచున్నారు. ఈశ్వరునిచే పొందబడ్డ పాకమామిడిపండును వారిభర్తభుజించి, దానియొక్క దైవీకమునుగనుగొని "ఈశ్వరుడిచ్చుట యెక్కడిదని" సందేహించెను. అప్పుడు అమ్మవారు పరమశివుని ప్రార్థించిమరియొక ఫలమును బొంది భర్తకునివ్వ వాడుతానుచేశిన యపచారమున్ను తనభార్య యొక్క అతిశయమున్ను తెలుసుకొని మదిలో నామెనుగొప్పదానిగా భావించి నమస్కారము జేసెను. ఇట్లు గృహస్థధర్మమందుండి మోక్షమునుపొందిన యమ్మవారు తనయవ్వనమున్ను సౌందర్యమున్నూ శివభక్తిజేయుట కడ్డముగానుండునని దెలిసి తనకు పిశాచరూపము యిచ్చునట్లు ప్రార్థించి దానినిపొందిరి. మనము సౌందర్యము కావలయునని ప్రార్థించెదము. వారు దానినివిసర్జించిరి. వారికి తగినగొప్పభక్తులు, మంగయర్కరసియారును, వేదముకూడదు శివభక్తికూడదుయను మతాచారముగల జైనులస్వాధీనమై రాజు శివమతస్థులనుహింసించుచుండుట మంగయర్కరసియారు సహించ శక్యముగాకయుండిరి. మనస్త్రీలకేమతముయందు యభిమానము యధికము. అప్పరు యొక్క జ్యేష్ఠసహోదరి, తిలకవదియమ్మయను వారుయుండిరి. అప్పరు యితరమతము నవలంబించిరి. తిలకవతియమ్మ దానిని సహించక తిరువదికై వీరట్టానంయను క్షేత్రమందు శివపరమాత్మతో మొరబెట్టుచుండిరి. వారిప్రార్థననంగీకరించి పరమశివుడు

అప్పరుకు శూలవ్యాధి గలుగునట్లుజేసి దానిమూలమున వారిని శైవమతమునకు ద్రిప్పిరి. మనమునిప్పుడు శివాలయములో కూడి యుండుటవల్ల శివభక్తులమహాత్మ్యమును పొగడవలయునని తలంచి నాను. పూర్వము యితరమతములలో జేరిన బ్రాహ్మణులను వైదికమతమందు జేర్చుకొనలేము. తక్కినవర్ణములలో జేర్చుకొన బడును. దానికిసాదృశ్యముగా నందిముద్ర, శూలముద్రయను రెండు ముద్రలు వేయబడును. అప్పరుక్కు పెన్నాడగంయను క్షేత్రమందు నందిముద్రయున్ను శూలముద్రయున్నూ వేసిరి. తిలకవతియమ్మ ప్రార్థనవల్లవారు మరల శివభక్తులైరి. అటులనే మంగయర్కరసి యొక్క ప్రార్థనచే పాండిదేశమున్ను రాజున్ను తిరిగి శైవమార్గములోకివచ్చిరి. తిరుజ్ఞానసంబంధ స్వాములవారి మహిమను వారున్ను ప్రధాని కులచ్చిరయూరున్ను విని వారు పాండియరాజును ద్రిప్పవలెనని దూతనుపంపిరి. పాలువాసనమా రక బాల్యావస్థయందున్న వారుగానున్న సంబందరును చూచిన తోడనే "యీశిశువువల్ల సాధ్యమా" యనిమంగయర్కరసి యూరు యాతురతపడిరి. ఆవిధముగా వారుచిన్నవారైనను జైను లకున్ను వారికిన్ని కొన్నిప్రతిజ్ఞలు యేర్పడి వాటిలో జైనులు జయమొందిరి. వెనుక వారువారు తమతమ సిద్ధాంతమును తాళ [illegible] వైఘునదిలో విడువవలెననియు యేదిప్రవాహాము [illegible]

నకు నెదురుజనునోనది సత్యమని నిర్ణయించుకొనిరి. అప్పుడే; సంబంధ స్వామివారు ( స్వస్తిదశకము ) నుయిట్లుపాడిరి.

" బ్రాహ్మణులకు మంగళమాగాక !
దేవతగోబృందములకు మంగళమాగాక !
సువృష్టి కలుగుగాక !
రాజు యభివృద్ధి జెందుగాక !
చెడువిషయములు యెల్లక్రుంగిపోవుగాక !
హరనామమే పరివేష్టించుగాక !
ప్రపంచదుఃఖము నివారణమాగాక ! "

ఎచ్చట చూచినను హరనామము పరివేష్టించుగాక, అందుచే ప్రపంచదుఃఖము తొలగిపోవుగాక యనివారు యీదశకమందు నుచెప్పియున్నదానిని గమనించవలెను. మనముశివదర్శనముచేయు నప్పుడు హరహరయని చంపలు వాయించుకొను చున్నాము. చంపలు వాయించుకొనుటకే హరహర వేసుకొనుట అనిపేరు. వైష్ణవులు పెరుమాళ్ళుని సేవించునప్పుడు చెంపలువాయించుకొను టలేదు. హరహరయని చెప్పుటచేత దుఃఖము నివారణమౌనని పెద్దలు చెప్పియున్నారు. దుఃఖనివర్తికి మనము వకీలులు డాక్టరులు మొదలగు యనేకులను యోచించుచున్నాము. దుఃఖము దీర్చు మన పెద్దలుజెప్పియుండు నుపాయమును గమనించెదము. ప్రపంచముయొక్క దుఃఖ నివారణకొరకు హరనామము పరివే

ష్టింపవలెను. ఈశ్వరుని భక్తియుండినట్లైన భక్తులయందు భక్తి స్వయముగా గలుగును. అప్పుడు పరస్పరప్రీతికలుగును. ముక్కోణమువలె ఈశ్వరునియెడల మనకుప్రీతి, వారికిప్రీతి, గనుక వారికి మనయెడలప్రీతి, వారియందు మనకుప్రీతిగలుగును.

వైష్ణవసంప్రదాయమందు "గోవిందా గోవిందా" యని నామావళిపలుమారు జెప్పుటవాడుక. బ్రాహ్మణులలోను కొందరుదప్ప యితరవర్ణస్థులెల్లరును రెంటినిజెప్పుదురు. వైష్ణవులలోను యిప్పుడు బహుకొద్ది వారుదప్ప యితరులు హరహరయని జెప్పుచున్నారు. శైవమున్నూ, వైష్ణవమున్నూ, నొక సామాన్యమతముయొక్క శాఖలు. సామాన్య మతము వైదికమతము. "వైదికమార్గము పుష్కలముగా వృద్ధియాగాక" యనిజ్ఞానసంబంధంస్వాములు జెప్పియున్నారు. శైవమునకు వైదిక శైవమనేపేరు. పాండ్యదేశమందు నాస్తికప్రవాహము పొర్లిపోయిన కాలమందు మంగయర్కరసియార్ శివభక్తి గలవారుగానున్నందుననే వొక యతిబాల్య శిశువుయొక్క యనుగ్రహముచే హర నామము పాండియదేశమందంతయు ధ్వనించునట్లు యేర్పడెను. ఆనాడు యాశిశువు కోరినది నేటికిని మనము జెప్పుచున్నాము. పెద్దలు సంకల్పించునది సంభవించుచున్నది.

ప్రస్తుతలోకస్థితియందు పురుషులకు నాస్తిక్యబుద్ధి తీవ్రముగానుండు గృహములలో స్త్రీలుకృశించి కుంగిపోవుచున్నారు.

వారికి భక్తియుండువరకు మనమతమునకు హానిసంభవించనేరదు, మనధర్మముచెడదు. తనయొక్క సహోదరుడు నాస్తికుడైనకాల మందు తిలకవతియమ్మ ప్రార్థించుట నాలకించియే పరమకరు ణానిధి వారినిశైవమునకు త్రిప్పిరి. తమయొక్క పురుషుడు నాస్తి కుడైనది సహించక మంగయర్కరసియారు మనోవ్యాకులము పడినందుకు విచారించియే పరమేశ్వరుడు యనుగ్రహించిరి. స్త్రీలు మనయొక్క దేవాలయములలో సన్నిధానమందు ప్రార్థిం చువరకు భాధకములేదు. పురుషులు శ్వేతముఖుల దేశముల యందుండు యాచారములనుజూచి మార్పు జెందుచున్నారు. అయినను మనస్త్రీలయొక్క స్థైర్యము చలించదు

ఈవిధముగనే స్వాములవారు జెప్పుచుండగా, పాముయని యరచుచు నొకప్రక్కనుండి జనులులేచిరి. కొంతసేపటికి పాము కాదని కూర్చుండిరి. అప్పుడు స్వాములవారు యీక్రిందివిధముగా జెప్పిరి.

విష్ణుసహస్రనామమందు మహావిష్ణువునకు వెయ్యినామ ములు జెప్పబడియున్నవి. అటులనే శివసహస్రనామము, లలితా సహస్రనామమను యమ్మవారి సహస్రనామములున్నవి. "అనం తనామవ్యాప్తమై దేవతలు స్తుతించు మహాప్రభో" యనుచు తేవారమందు జెప్పియున్నారు. అదియట్లుండ విష్ణుసహస్రనామ ములలో "భయకృతేనమః" అనియు "భయనాశ నాయ

నమః” అనియువరుసగా భయమును కలిగించువారు వారనియు, భయమును నాశనమును జేయువారు వారేయనియు జెప్పబడి యున్నది. కనుక భయముమిధ్య అటులనే నిప్పుడు యేర్పడిన భయమునుమిధ్య అటులనే ధర్మమునకు హానికలిగినట్లు దేశమందు యేర్పడియున్న భయమున్నూ మిధ్యయైపోవును. అదిమిధ్యయై పోవునటుల స్త్రీలు భగవత్సన్నిధానమందు ప్రార్థించవలెను.



## ౭. “దేవాలయముల యుపయోగము.”

భగవంతుడనేక యవతారములను యెత్తియున్నారు. ఆ యవతారములలో రామావతారమున్ను, కృష్ణావతారమున్నూ ముఖ్యమని తెలుసుకొనియున్నాము. ఈ రెండు యవతారముల గురించి వేరుగా రామాయణమున్ను, భాగవతమున్ను యేర్పడి యున్నందున నివిముఖ్యములని తెలుసుకొంటిమి. వ్యాసులవారు 18 పురాణములు రచించియున్నారు. వాటిలో 4 లక్షల శ్లోక ములుండును. దశావతారకథలున్ను 18 పురాణములలో వారు చెప్పియున్నారు. అయితే వాల్మీకమహాఋషి రామావతారము జెప్పుటకు ప్రత్యేకముగా రామాయణము రచియించియున్నందు ననే, శ్రీరాముని విశేషమహిమను మనము తెలుసుకొన దగియు

న్నది. హిమాచలము మొదలు, సేతుపర్యంతము జనులయొక్క నామములలోను, గ్రామనామములలోను రామనామమే యధికముగానున్నది. పాఠశాలలోని పాఠపుస్తకముల యందుకూడ ననేక భాషలయందును రామచరిత్రము వ్రాయబడి యున్నది. అనేక కవీశ్వరులు శ్రీరాముని గుణముల గానముజేసిరి. అయినను నొకసంశయము గలుగుచున్నది.

మనము దేవాలయమునకు వెళ్లి మనకోరతలను నివారణ జేయవలయునని భగవంతుని వేడుచున్నాము. కొన్నిసమయములలో నివారణమగుచున్నది. అయితే సర్వమునివర్తియగుటలేదు; ఒకటి, స్వామికి సర్వజ్ఞత్వములేదు; లేక కరుణలేదు. అయితే వారుసర్వజ్ఞులనియు, దయాసింధువనియు జెప్పబడియున్నది. మన కర్మమువల్ల కష్టముగలిగెనేని, కర్మమును ధ్వంసము చేయవారికి శక్తిలేదా ?

పాదరీలు వారి ప్రచారమునకుగాను నొకపుస్తకము ప్రచురించియున్నారు. అందులో రాముని గురించి యిటుల ప్రశ్నచేసియున్నారు. రావణుడు సీతనెత్తుకొని పోవుచుండ, నొకమైలు దూరములోనున్న శ్రీరాములవారికి సీతవేసిన కేక చెవినిపడలేదా ? సీతవేశినకేక చెవినిపడలేకపోయినందున యిప్పుడుమీరు వారిని పిలుచుట వారిచెవినియెట్లుపడును ? యని వారు ప్రశించియున్నారు. ఇవ్విధముగానే వారలు ప్రచారముజేసి కొద్దిఫలమును

పొందియున్నారు. అనేకగ్రామజనులు నిటువంటి ప్రచారమువల్ల వారియొక్క మతము నవలంభించిరి. తంజావూరుజిల్లా యొక్క దక్షిణ భాగమందును రామనాథపురముజిల్లా యుత్తర భాగమందును రెంటికి మధ్యనయున్న పొదుక్కోటి రాజ్యమందున్న ఉడయారు జాతివారిలో యనేకులు క్రైస్తవులైరి. సుమారు మూడువందల సంవత్సరములలోపున యనేక గ్రామస్తులు యిట్లు మారిపోయిరి. యాళ్పాణమందును శైవులుగానుండిన నున్నత జాతిపిళ్లేలలో యనేకులు క్రైస్తవులైరి. కొన్ని జాతులవారిని మనము దేవాలయములోనికి పోనివ్వనందున వారుక్రైస్తవులగుచున్నట్లు చెప్పబడుచున్నది. దేవాలయమునకు పోదగు జాతివారును క్రైస్తవులైవున్నారనుట పైననేనుచెప్పిన విషయములవలన తెలియుచున్నది. క్రైస్తవులయిన పంచములస్థితియున్నతముపొందలేదు. క్రైస్తవులైనారని యనుటచేత మనదేవాలయములలోనికి వారిని రానివ్వడమున్నూలేదు. వారిదేవాలయములలో, నితరులతో సమానముగా నాదరింపబడుచున్నట్లును తెలియుటలేదు. మనలో యొకతప్పిదమున్నది. మన మతాచారములను రక్షించవలసినవారు దరిద్రతాహేతువుచే నింగ్లీషుచదివి మతాచారములయందు శ్రద్ధమానినందున పాదరీల ప్రచారమునకు యెదిరి ప్రచారము జేయబడుటలేదు. పాదరీలకు రాజ్యాంగ సహాయమున్నది. మతసంభందశాఖ ( ఎక్లీసియాస్టికల్ డిపార్టుమె

మెంటు) యని రాజ్యాంగమందు దానికొరకొక శాఖయే యున్నది. సర్కారువారిచే నాశాఖకు ఖర్చు యివ్వబడుచున్నది. మన రాజులున్న కాలమందు వారును నావిధముననే మనమతమును గాపాడుచూ వచ్చిరి. దేవస్థానములకు మాన్యము లొసంగి యుండిరి. శాస్త్రముల జదివి వృద్ధిజేయుకొరకు బ్రాహ్మణులకు శ్రోత్రియములనొసంగి యుండిరి. దేవస్థానములకు మాన్యము లిచ్చుట యనగా కొన్ని గ్రామములలోనుంచి రాజ్యాంగమునకు రావలసిన భాగమును దేవస్థానములకు జెందునట్లు త్తరువు చేయుటేయగును. కనుక భూస్వాములకున్ను రయితులకున్ను నుండు భాద్యత మాన్యముచే బాధింప బడనేరదు. రాజ్యాంగమునకు రావలసిన దానినేవారు దేవస్థానమునకు చెల్లించి విడిచిరి. రాజ్యాంగమునకు జెందవలసినది యాకాలమందు ధాన్యముగా జెల్లింపబడుచుండెను. కనుక దేవాలయములకును మాన్యము ధాన్యముగా జెల్లింప బడుచుండెను. ఈదొరతనమువారు వచ్చినదాదిగా ధాన్యమునకు బదులుగా నాకాలపు ధర ప్రకారము రొక్కము రూపాయిలుగా నిచ్చునట్లాజ్ఞాపించిరి. ఆకాలమందు కలము (38 శేర్లు) ధాన్యపు ధర నాల్గణాలుగానుండెను. ఈధరప్రకారముననే దేవస్థానములకు ధాన్యపు రొక్కమును నిర్ణయించిరి. అదిధర్మన్యాయమే. అప్పుడు పదిరూపాయలకు నలుబదికలముల ధాన్యముకొనవచ్చును. ప్రస్తుతమంతరాదు. తదుపరి ధాన్యపుధర హెచ్చినకొలది తదను

స్వారము సర్కారుకిస్తుకొన్న సమయములలో హెచ్చించియున్నారు. అయితే దేవాలయముల కేర్పడిన ధాన్యపురొక్కము, యా కాలమందు నిర్ణయింపబడిన ప్రకారముననే యున్నది. దేవాలయముల సంరక్షణకొరకు ప్రస్తుతమది చాలకున్నది. దేవాలయములలో యనాచారములైన కార్యములు జేయబడు చున్నవి. వాటిని నిరోధించుటకు యోగ్యులగు రక్షకభటుల నధికముగా నియమించుటకు తగుద్రవ్యములేదు. మనమంత్రులు మొదలైన రాజ్యాంగమందు మాటచెల్లుబడి యున్నవారు యీవిషయమును రాజ్యాంగమునకు తెలిపి వారలుతీసుకున్న మాన్యమునకు రావలసిన ధాన్యమునకు కాలపు ధరప్రకారము దానపురొక్కము యివ్వవలయునని, జెప్పినట్లైన రాజ్యాంగపువారు, వినుదురని విశ్వసించుచున్నాను. నవాబులు రాజ్యపరిపాలన జేయు కాలమందును, దేవాలయములకు మాన్యమొసగిరి. వారురాజ్యము స్థిరపడిన తదుపరి, సర్వప్రజలను సర్వవిధముల సరిసమానముగనే, పాలించుచుండిరి. మనమతమునకుకూడా వారిరాజ్యమందు మాన్యమొసంగిరి. మనరాజ్యాంగము వారికి న్యాయమని నివేదించినయెడ దానిని వారాదరింతురు. నివేదించువారలే లేరు. రాజ్యాంగమునకు సంబంధించినసభలకు బోవువారు దేవాలములందు శ్రద్ధ గలవారుగా నుండవలెను. మనదేవాలయములలో యనాచారములు నడుచుచున్నవి. పూజారులలోకొందరాచార రహితులైయున్నారు;

వాటినెల్లను నివారణజేయుటకు ప్రస్తుతమున్న ద్రవ్యము జాలకున్నది. దేవాలయములలో జూదమాడకుండను, బీడీలుత్రాగకుండను చూచుకోవలెను. పూజారులు స్నానముజేసియే స్వామిని స్పృశించవలెను. దేవాలయధర్మకర్తలు దానికికావలసిన సౌకర్యములను సమకూర్చవలెను. మళయాళదేశమందు పూజచేయువారు బ్రాహ్మణుని తాకినను మరలస్నానముజేసియే స్వామిని స్పృశించవలెను. పూజజేయువారు మంత్రములను తెలిసినవారుగ నుండుటావశ్యకము. పారలధ్యయనము జేసియుండవలెను. ఇవ్విధముగనెల్లనాచరించుటకు దేవాలయ ధర్మకర్తలు, యుపకారము జేయవలెను. వారికి జనులయొక్క సహాయముండవలెను.

రామావతారమును గురించి యుపన్యసించునప్పుడు యీవిషయులనెల్ల జెప్పుటకేర్పడినది.

క్రైస్తవపాదరీలు మనలనడుగు ప్రశ్నలను మనమున్నూ వారిని ప్రశ్నించవచ్చును. వారున్నూ దేవాలయములలోస్వామిని పిలుచు చున్నారు. తమయొక్కకొరతల నివారణ చేయవలెనని వేడుచున్నారు, మైనపువత్తులు వెలింగించి బెట్టుచున్నారు. అయినను వారియొక్క ప్రశ్నలకు మనశాస్త్రములే బదులుచెప్పగలవు. వారిని విచారించగా పిశాచాధిపతియను నొకదుష్టుడు భగవంతునికి పోటీగా నొకరాజ్యమును నడిపించు చున్నట్లు జెప్పు

దురు. మనశాస్త్రము లేమిచెప్పుచున్నవి ? ఈశ్వరుడు పరిపూర్ణమైన జ్ఞానస్వరూపి. కనుకయొకటిమంచిదని వేరొకటిచెడ్డదని వారికిలేదు. మనముకించిత్తు జ్ఞానముగలవారముగానుండబట్టి మంచిది చెడ్డదిఅని, సుఖము దుఃఖముయని తలంచుచున్నామని శాస్త్రము జెప్పుచున్నది. మంచిచెడుగులు లేనియెడల యనేకయాచారముల నెందుకు శాస్త్రమేర్పరచి యున్నదని ప్రశ్నింపవచ్చును. మంచిదనిన్ని చెడ్డదనిన్ని మనముతలంచుచున్నాము. ఆతలంపు నివారణ జేయ అనేకకార్యములు జేయునట్లు భగవంతు డాజ్ఞాపించి యున్నారు. ప్రతివారు కోరునది, వారు యిచ్చువారైన యెడల జీవులయొక్క యాశను పెంచగలరు. ఇవ్వగ నివ్వగ నంతకంతకు నాశయతిశయిల్లును. కనుకనే వారు మనవిన్నపముల ప్రకారము జేయుటలేదు. తనయెడల నమ్మకముండునట్లు జేయుటకే యొక సమయమునందేదేని యనుగ్రహముజేయుదురు. స్వామి వరమిచ్చువారయిన యెడల, మనుష్యులయొక్క కోరతలే యధికమగును. పదునాలుగులోకములను పొందినను తృప్తి యుండనేరదు. కనుక కోరతల నధికముజేయకుండుటకే వారు వరమిచ్చుట లేదు. మంచిది చెడ్డదియను తలంపు వీడినయెడల కోరత వీడిపోవును. భేద జ్ఞానము లేనియొకదానిని పట్టుకున్నయడలనే మనకు నాజ్ఞానము కలుగును. కాననటువంటి యద్వైత మతమగు స్వరూపమును మనము ధ్యానము చేయుటకే దేవాలయ మేర్పడియున్నది. ఆచా

రములననుష్ఠించి యనాచారముల విసర్జించినయెడల భేదజ్ఞానము లేనిస్థితిగలుగును. ఆచారము తొలగిపోయినయెడల నటువంటిస్థితి యొకటియుండుటే మరువనగును. భేదజ్ఞానములేనిస్థితిపొంద భేదజ్ఞానములేనివారియెడల ప్రీతిసలుపవలెను. ప్రతిప్రయోజనమునకై నెదురుచూడక భక్తి జేయవలెను. ఈశ్వరభక్తి జేయుటకు వారికి యభిషేకాదులు జేయుటెందుకని నడుగుచున్నారు. ప్రశ్న సరియే అయితే యీప్రశ్నలో ప్రీతిలేదు. మనయిండ్లలో శిశువునకో తల్లికో యసౌఖ్యముగానున్నది, బ్రతుకుట దుర్లభమని తెలుసుకొనిన్నీ వైద్యము జేయుచున్నాము. ఎందువలన? ప్రీతిదానికి కారణము. ఈశ్వరభక్తి కారణమగుటచే దేవాలయము కట్టుచున్నాము, దానిచేఈశ్వరునికి యేమిలాభములేదు. మనయొక్క యాత్మపరిశుద్ధతను పొందవలెను. మనధర్మములు యెంతయో కాలముగా నడుచుచూవచ్చుచున్నవి. మరేమతమున్నూ యింత కాలము వుండినదిలేదు.

కొంతకాలమువరకు మరుగై యున్నను భాధకములేదు. ఎన్నియోయడవులున్నవి, యెచ్చటనైన వుండియేతీరును. మనమతము యెంతధృఢమగునది మన దేవాలయములవల్ల తెలియుచున్నది. పాడుపడిన దేవాలయములున్న శిథిలమైపడిపోవుటలేదు. అస్తిభారమంతబలము. కట్టినందుకు పట్టినసెలవు, పడద్రోయుటకున్ను నగును. అవ్విధముగా పడద్రోసి రాళ్లనుప్రక్కకుద్రోసి యుంచి

నను, కొంతకాలము గడిచినవెనుక, పూర్వము దేవాలయమున్న స్థళమనియెరిగి యెవరేనినొకస్వామిని ప్రతిష్ఠచేసివిడుతురు. కనుక మనమతమునశించదు. సహగమనమును చట్టమువల్ల నిలిపివేసిరి. ఆకార్యము తప్పిదమని నేటికిన్ని మనము తలచుటలేదు. ఉత్తర దేశమందు సంవత్సరమునకు నిరువ్వైనను నిప్పటికిన్ని సహగమ నముజేయుచున్నారు. వారిని మహాపతివ్రతలని జనులుకొనియాడు చున్నారు. పూర్వకాలమందు నిర్బంధించి యెల్లస్త్రీలను సహగమ నముజేయునటుల జేసిరనుటతప్పు. అటులైనచో వితంతులకాచార విధులు నేర్పడియే యుండియుండవు.

శివాజి మహారాజున్ను, విద్యారణ్య స్వాములున్ను మన ధర్మములనస్తిభారముగ గైకొనినట్లే తెలియుచున్నది. ఆత్మపరి శుద్ధికిగానే కర్మములనుజేయు రాజ్యములనుస్థాపించిరి స్వరాజ్యము నకై ధర్మములను విసర్జించవలసినదిలేదు. ఎవరిపైనను కోపించక మనధర్మమును మనముజేయవలెను.

పాదరీల ప్రశ్నలకు ప్రత్యుత్తరము :—

ధర్మశాస్త్ర ప్రకారము, మనుజుడెటుల నడువవలసినది, తానేనడచినూరు, భగవంతుడు రామావతారమెత్తిరి. నాటక శాలలో వేషమునకు తగినట్లు నటించవలయును. ఒక నాటక

శాలలో వశిష్టాశ్రమము గనబడుచున్నది; లవకుశులు నిలుచు న్నారు, శ్రీరాములు వస్తున్నారు, వారువసిష్టునిజూచి యీ బాలు రెవరని యడుగ, రాజవేషధారి రామస్వామి అయ్యంగారి కొమాళ్లని చెప్పకూడదు. అది యథార్థమయినను రసాభాసము. పాదరీలవారియొక్క ప్రశ్నయున్ను యట్టిదే భగవంతుడు మాన వుడుగా నటించునప్పుడు వారిదైవీక శక్తి యెక్కడకు బోయెనని యడుగుట రసాభాసము.

—o—

## ౮. "స్వామి యనగానేమి?"

వైకుంఠమందు స్వామియున్నారు, హృదయమందున్నారు, దేవాలయమందున్నారు. ఈవిధముగనెల్ల మనపెద్దలు జెప్పియు న్నారు. దేవాలయములో యున్నారనగ నచట నమస్కారముజే యుచున్నాము. హృదయమందున్నారనగా, శివపూజ చేయువా రుమొదట తమహృదయమందు ఈశ్వరునకుపచారములు జేసి, యచటనుంచి వారిని మూర్తియందావాహనము జేసి, తమపరి మూర్తిపూజ జేయుటవాడుక. వైకుంఠమందున్నారన్నట్లుగా కైలాసమందున్నారనియు పెద్దలు చెప్పియున్నారు. వైకుంఠ

మన యాదియాచార్యులకు "చిక్కుడయా" రనుపేరు వాడు కలోనున్నది. కన్నడమందు 'చిక్కా' యనుదానికి 'చిన్న' యనుయర్థము. కాంచీపురయేకాంబరేశ్వరులు దొడ్డయుడయా రని శాసనములలో జెప్పబడియున్నారు. ఈ చెన్నపట్టణము చుట్టూవుండు తిరువళ్లూరు మొదలైన మూడుతాలూకాలలో 'చిక్కుడయార' నునిట్టియాచార్యులకు, రాజుకు రయితులు చెల్లించవలసిన పన్నులలో కలమునకు నాళాకు ( $\frac{1}{192}$ కలము ) ప్రకారము వార్షికమునిచ్చునట్లు చోళదేశరాజులును, పల్లవ రాజులును, నుత్తరవుజేసియుండిరి. నేటికినీయది నడుచుచూవచ్చు చున్నది. ఎవరేని యివ్వనియెడల యిప్పుడుండు రాజ్యాంగము వారికి తెలిపినట్లైతె దానినివ్వమని వారును యాజ్ఞాపింతురు. అది భూములమీాద యేర్పడిన వార్షికమైనందున, నాభూములేమతస్థు లయుండుండినను వారుయివ్వవలెను. చెన్నపట్టణ ప్రాంత్యముననే మఠమునకిట్టిబాధ్యత యేర్పడియుండుటచేత మఠము, యీప్రాం త్యములకుచెందినదని స్పష్టమగునున్నది. మఠముల కాచార్యులు గానుండిన నిద్దరు స్వాములయొక్క, బృందావనములు తిరువట్రి యూరిలోనున్నవి. ఈప్రదేశములోనే మఠముండినదని దీనివల ననూ తెలియుచున్నది. మఱియు తిరువట్రియూరిలో యాది యాచార్యుల శిలావిగ్రహామున్నది. చెన్నపట్టణములో తిరువేఒశ్వ

రుని దేవాలయమందును; యేకాంబరేశ్వరుని దేవాస్థానమందును, చెన్నపురీశ్వరునికోవెలయందును, వారియొక్క శిలావిగ్రహ మున్నది. ఇవ్విధముగ నితరగ్రామములలో రెండు మూడు దేవాలయములలోలేవు. ఇత్యాది విషయములనుబట్టి చెన్నపట్టణ చుట్టుప్రదేశమే యాదియాచార్యులకు మిక్కిలి స్వంతమని తెలియుచున్నది. స్వామియను పదమునకు, నుడయారను యర్థములోనుండి యీప్రస్తావనమెల్ల నేర్పడినది. శ్రీరామానుజులవారికి యుడయవరనుపేరు యేర్పడియుండుటయు స్వామియను పదమునకు మారుపదమే. శ్రీరామానుజస్వాములవారని చెప్పుటకు బదులుగా నుడయవరని జెప్పుచున్నారు. ఇవియిట్లుండుగాక స్వామియెక్కడున్నారు? వైకుంఠమందో, కైలాసమందో, హృదయమందోయున్నారనుట నొప్పుకోదగినది. దేవాలయములో నున్నారనగానేమి? దేవాలయములో వారుండినట్లైతె యితరస్థళములలో లేరా? ఒక్కొక్క దేవాలయములో యున్నావారొక్కరా, వెవ్వేరా? వారెల్లడలనుండినట్లైతే దేవాలయములో వందనము చేయుటేల? బాటలో వందనము జేసిననునేమి? దేవాలయములో "నావైపున కాలుచాపవద్దు, నచ్చట స్వామియున్నా" రని జెప్పుచున్నారు. అటులైనచోవారు మరెచ్చటనులేరా?

ఒక నుదాహరణము తీసుకొనెదము. సూర్యుడు నెచ్చటను మన్నారు. వారియొక్క కిరణములయందు ప్రకాశమున్ను నూష్ణ

మున్ను యున్నవి. సూర్యుని, తేజమేగాక నెల్లతేజస్సులకున్ను యీ రెండు గుణములున్నవి. అయితే నొకతేజమందు నొకటి తగ్గుగానున్ను నింకొకటి నధికముగాను నుండవచ్చును. ఇనుప పెనమునుపొయ్యిపై పెట్టుతున్నాము. కొంతతడవైన తరువాత దానిలో నుష్ణము యధికముగానున్నను ప్రకాశము తగ్గుగానే నుండును. మిణుగురుపురుగుయొక్క వెనుకభాగమందు ప్రకాశ మున్నది. అయితే వుష్ణములేదు. రెండునుగలతేజస్సు సూర్య కిరణము. స్ఫటికముతోచేయబడ్డ లెన్సుయను పనిముట్టుక్రిందదూది నిపెట్టినయెడల ననేకసూర్యకిరణములు నొకటిగాజేరి దూదినియగ్గి పట్టుకొనుచున్నది. కిరణములు నద్దముపై పడినయెడల ప్రకాశము నధికమాచున్నది. ఆవిధముగానే, భగవంతుడులేనిచోటు లేనట్లై నను వారియొక్క యనుగ్రహశక్తిని నొక క్రియామూలముగా నొకటిగాజేర్చిపెట్టి యున్నస్థళము దేవాలయము. ఆక్రియవల్ల శక్తినొక్కటిగానెందుకు కూడుటయనునది మనకు తెలియదు. అయితే దానిలోమనముయేదేని మార్పుజేయుదుమేని దేవాల యము బాటకుసమానమైపోవును. శాస్త్రములయందు వ్రాసిన దానికి విరోధముగా నెవరేని నడచినయెడల దానిని మనముదిద్ద వలెను. మనదేవాలయములు ప్రార్థన మంటపములుకావు. ఈశ్వ రానుగ్రహమునకుగాను శాస్త్రప్రకారము నేర్పడియున్న స్థళ

ములు. మహాక్షేత్రములయందు ననుగ్రహాశక్తి యధికముగా నున్నది. అవి మహాఋషులు పూజించిన స్థళములు.

సరి; స్వామియనునదియేమి? మనమే. హిరణ్యకశిపుడు జెప్పినదానికిన్ని "మనమేస్వామి" యని నేను జెప్పూటకున్ను వ్యత్యాసములేదని తోచును. స్వామివేరు మనము వేరుకాదనియే నేను జెప్పుచున్నాను. అదియే యద్వైతము. నేను జెప్పునదియే "తిరుపుగళ్" గానముజేసిన అరుణగిరినాదరున్ను జెప్పి యున్నారు. "నీవువేరుగాకనుండుట, నేను వేరుగాకనుండుట" యనినొక "తిరుపుగళి" లో వారుజెప్పియున్నారు. అయినను నిది పరమయపచారముగా తోచును. మనవలె కించిజ్ఞుడని భగ వంతు నననౌనా? అనియడగనౌను. అయితే మనయాచార్యులును నవ్విధముగనే జెప్పియున్నారు. వారు షణ్మతస్థాపనము జేసిన వారు. ఇతరాచార్యులెల్లరును వారికాలమునకు వెనుకవచ్చిన వారుగనుక, వారు గోచరించిన కాలమువరకు నెల్లరను వారి శిష్యులే. వారు "మనమే" స్వామియనుచున్నారు. తెలియుట లేదు! స్వామియనుట నేమియని, యెల్లరును నొప్పుకొన దగిన లక్షణప్రకారము "మనమే స్వామియనుట నిలచునా, యద్వైతముతప్పు" అనిచెప్పనౌను. ఒక వుదాహరణముతో వివరించుచున్నాను. ఒక వుద్ధరిణలో జలమున్నది. ఒక పంచ పాత్రిలోజలమున్నది. పంచపాత్రిజలము వుద్ధరిణజలముకంటే

నధికము. చెంబుజలము పంచపాత్రి జలముకన్న నధికము. తద్విధముగనే గంగాళజలము చెంబుజలముకన్న నధికము. దాని కంటెనధికము నూతిజలము. దానికన్ననధికము నదీజలము. దాని కంటె నధికము సముద్రజలము. దానికన్నను నధికములేదు. మనము తెలుసుకొనియున్న పదార్థములలో సముద్రముకన్నా వేరేదియునధికములేదు. మనము ఉద్ధరిణజలము. భగవంతుడు సముద్రము. అవ్విధముగనే మనము కొద్దిబఱువు నెత్తగలము. మూటను మోయువాడు మనమెత్తగలబరువుకన్న నధికముగా నెత్తును. ఎద్దు వానికన్న నధికముగ మోయును. ఒంటె దాని కన్నను నధికము మోయును.

ఒక ప్రాణికంటెను నింకొకటి యధికశక్తిగలదై యుండగా నీలోకమెల్లను మోయగలిగిన తెలివిగల ప్రాణియొకటి యుండ వలెను. అటులనేఒకక్రిమికన్నను నొక చీమకు నధికముగా దెలు సును. చీమకన్నను మనకు నధికముగాదెలుసును. మనకన్న నొక శాస్త్రజ్ఞున కధికము దెలుసును. వానికన్నను నొకయోగికి నధికము తెలుసును. కనుక నన్నియు తెలిసిన యొకడుండవలెను. మనమొక యిల్లునుకట్టుదుము. వాడు ఈప్రపంచమును నిర్మించును. మనకు ఒక హద్దున్నది. వాడు హద్దులేనివాడు. కాన వాడు జ్ఞాన సముద్రము, దయాసముద్రము, శక్తి సముద్రము, సర్వజ్ఞుడు.

మనము వారియొక్క సొత్తు. వారు స్వామి. మనలను స్వాధీనము
చేసుకొన్నవారు.

ఇటుల నిండియుండు స్వామినిగూర్చి భగవాన్ కృష్ణుడు విస్తారముగ జెప్పియున్నాడు. కృష్ణుడనుపేరు వారిచరిత్రము యెంతవ్యాపకము పొందియున్నదో యనునది జ్ఞాపకము చేయుచున్నది. కృష్ణుడనుపేరును మహారాష్ట్రభాషయందు 'క్రిష్టో' యనియు 'క్రిష్టు' యనియు జెప్పుచున్నారు. కృష్ణుడనుపేరే 'క్రీస్తు'. శ్రీకృష్ణ భగవాన్ పాదములయందు బాణము తగిలి దేహమును విడిచిరి. క్రీస్తున్ను సిలువపై మేకులతో గొట్ట, దేహమునువిడిచిరి. క్రీస్తు చరిత్రమును మన పురాణమునుండియే వారు వ్రాసుకొని యున్నారు. శ్రీమాన్ యం. యస్. రామస్వామి అయ్యరు యీవిషయమును గురించియే కొన్ని చిన్నప్రచురములను ప్రకటించి యున్నారు. క్రైస్తుద్రవిడులనియు, విశ్వకర్మయనియు, తెంగలనామము ధరించినవారనియు వ్రాసియున్నారు. అది సరిగాదని తలంచుచున్నాను. క్రీస్తు సుమారు 2000 సంవత్సరములకు పూర్వీకులని క్రైస్తవులు చెప్పుచున్నారు. వడగలె, తెంగలెనామములు రామానుజుల వారికాలమునకు పిమ్మట అనగా సుమారు 600 సంవత్సరములలోపుగా నేర్పడినవి. నేడున్న నొకవిషయము 2000 సంవత్సరములకు పూర్వమున్నటుల జెప్పుట సరిగాదు. మన ఉపనిషత్తులలో చెప్పబడియున్న నొకవిషయమును వారు చదువు

క్కొని యర్థమును చక్కఁగా తెలుసుకొనక గ్రహించినారని తలంచు చున్నాను. 'జా' యనుశబ్దము 'యా' యనుశబ్దముగామారి పోవును. 'జాకోబ్' అను హీబ్రుభాషపదము. 'యాకోబ్' అగుచున్నది; 'జోసఫ్' అనునది 'యూసుఫ్' అగుచున్నది. 'జమ్న', 'యమున'; జాత్ర, యాత్ర; జాదో, యాదో; జా, యా యగుటను యీ యుదాహరణములు స్పష్టపరుచు చున్నవి. ఒక యుపనిషత్తులో, మొదట నాత్మ మాత్రమే యుండెను. మాయాసంబంధమువలన జీవుడేర్పడెను. అది పిప్ప లము ( కర్మఫలము ) ను భుజించెనని జెప్పబడియున్నది.

ఆత్మను 'ఆద' మనియు, జీవుని 'ఈ' వనియు ఫల మును 'ఆపిల్' పండనియును వారు "పూర్వపుయేర్పాటు" లోవ్రాసికొనియుండిరి. కృష్ణుడు గోపాలుడనియనగా గోరక్ష కుడని చెప్పబడియున్నది. క్రైస్తవునియాదవుడని జెప్పియున్నారు. క్రైస్తుచరిత్రము కృష్ణచరిత్రము పోలియేయున్నది. మనపురా ణముబట్టి వారువిని దానినే వ్రాసుకొన్నారు. ఒకరివద్దనుంచి యొకకథ మరియొకరివద్దకు పోవునప్పుడందులో మార్పులేర్పడును. ఎందరిచేతులలోబడి కృష్ణచరిత్రము క్రైస్తుచరిత్రమాయనో! అలగ్జాండ్రా నగరమందనేకసభలు కూడి యిప్పుడుండు బైబిల్ రూపము పొందినది. మరికొన్ని యుదాహరణములు చెప్పు చున్నాను. మనుష్యుడను దానికివారు 'మ్యాన్' ( Man )

అని చెప్పుచున్నారు. ఈ 'మ్యాక్' అనుపదమెటుల గలిగెను? మనుజక్ అను సంస్కృతపదమేయది. జక్ అనగా జనించునదియని యర్థము. మనుజక్ అనగా మనువునుండి జనించినవాడు. కనుక మ్యాక్ అను శ్వేతముఖునిపదము, మనువుకు సంబంధించిన వాడని యర్థముగలది. కనుక మ్యాక్ అనుపదమేర్పడిన దానికి పూర్వము మనపురాణ ముండి యుండవలెను. కనుక పురాణ ములు క్రైస్తు పుట్టినతరువాత ఈ శతాబ్దమందేర్పడిన వనియు క్రైస్తుకు పూర్వము ఈ శతాబ్దమందేర్పడినవనియు జెప్పుట సరికాదు. ఇతర భాషలయందర్థము స్పష్టముగ తెలియని పద ములకు నర్థము, సంస్కృతమునుండి తెలిసికొనగలము. పార్శీకుల గ్రంథము "జెందవస్తా" అని చెప్పబడుచున్నది. జెందవస్త యనగానేమియర్థము? 'సంధోవస్త' అనునది 'జెందవస్త' అయిఉన్నది. ఋగ్వేదమంత్రములే 'జెందవస్త' లోయాభా సముగా నున్నవి.

నవధాన్యములు కలిసినయెడల నెటులుండునో నటుల మన పురాణకథలు శ్వేతముఖుల దేశములలో కలసిపోయెను. క్రైస్తు చరిత్రమునకు మనపురాణమే మూలమని నాయభిప్రాయము. అయితే మీరు దానినొప్పుకొనవలెనని నేను జెప్పుటలేదు.

ఇక భగవాన్ కృష్ణుని యుపదేశమును జెప్పుచున్నాను. అన్నిటిలో, నున్నతమైనది స్వామియని వారు జెప్పియున్నారు:

అర్జునా! ప్రాణులన్నిటియందులోపల నిలచియుండు యాత్మ నేను, పుష్పమందునేను పరిమళము. మాసములలో నేను మార్గ శీర్షము. ఋతువులలో నేనువసంతము. ఏదేది గౌరవముకలిగినదో, సత్యము గలిగినదో, సౌందర్యము గలిగినదో, బలము గలిగినదో యవియెల్లను నేనని భగవంతుడు చెప్పియున్నపగిది యేది యుత్కృష్టమో యది స్వామి, దయలో నుత్కృష్టము స్వామి, జ్ఞానములో నుత్కృష్టము స్వామి, శక్తిలో నుత్కృష్టము స్వామి. వారు పరిపూర్ణులు, మనము తగ్గినవారము. మనము పెద్దపల్లము పోలి యున్నాము. దానిని సమముగాపూడ్చి మనలను పూర్ణుల చేయ వారు ప్రయాసపడుచున్నారు. అయితే మనకొఱతయగు పల్లము నిండుటలేదు. ఆహారము కావలెను, ద్రవ్యము కావలెను, బిరుదులు కావలెను, ఉద్యోగము కావలెను, అని మనకు ననేక కోరికలుండియే యున్నవి. ఇన్ని కోరికలలో "వాని ద్రవ్యము నాసంచిలోనికి రావలెను". అను యాశయే నిలిచి యున్నది. కనుక యీ పల్లము పూడుటలేదు. కాన మనము కొరతగల వారముగనేయున్నాము. స్వామికి కోరికలేదు. కావుననే వారు పూర్ణులుగనేయున్నారు. ఆయాలోపమును నివర్తి జేయనొక్కొ క్కటికి నొకసత్వమున్నది. ఒక కన్యకను వివాహము జేసుకొని పిలుచుకొని వచ్చుచున్నాడు. ఆమెకు సత్వమేది? వినయము, లజ్జ; మొదలైనవి. నాకు సత్వమేది? నేను యిచ్చట నొక ఆస

నముపై కూర్చుని యున్నాను. మీకెల్లరకు యుపదేశము జేయు చున్నాను. ఇది నాసత్వము. ఆకన్యకనొక ఆసనము వేసుకొని అనేకుల యెదుట కూర్చుని "నేను యుపన్యాసము జేయు చున్నాను మీరువినుడు" యనినయెడల నది యామెకుసత్వము కావున నొక్కొక్కరికి నొక్కొక్కటి సత్వము. ఆయా సత్వమే వారివారికి స్వామి. ఏయేస్థితిలో నేదిసత్వమో అందులో స్వామి యున్నారు. ఆయాసత్వము వారి వారికి ఆనందముగా నుండును. అదియే స్వామి. మన బాలికయందు మనకు ప్రేమ యున్నది. ఆమెకు తనభర్త యెడల ప్రేమయున్నది. అది యది యుత్కృష్టము. ఎచ్చట ప్రేమచెల్లవలెనో నచ్చట చెల్లక యిత రత్రచెల్లినట్లైతే యదినికృష్టమగును. అనగా రసము ఆభాస మగును. పానకములో నొక పిడికెడు వుప్పునునూ, కారము నునూ చేర్చినయెడల నదిరసాభాసము. కవీశ్వరులకునూ యనేక రసములుండును. ఈ రసమునకు తదుపరి యీ రసము కావలెనని విధియున్నది. స్వరమందును యటులనేవిధికలదు. సంతోషము నివ్వ యీ స్వరమునకు పిమ్మట యీ స్వరము రావలయునని యున్నది. ఏడ్పు స్వరమువల్లనే యమరియున్నది. అయితే, స్వర క్రమములేదు. ఈకాలమందు రసముల ననుసరించిన రుచియే జనులయెడ మారిపోయెను. కావుననే భాగవతులు కథచెప్పు నప్పుడు దుఃఖమునుంచి హఠాత్తుగా సంతోషమునకు వచ్చు

చున్నారు. ఎందుకు? జనులయొక్క రుచి చెడిపోయెను. పొగాకు తినుచున్నారు. ఎందుకు? నాలుకయొక్క రుచి చెడిపోయినది. తత్ఫలముగా ధర్మము చెడిపోయినది. ధర్మము చెడినప్పుడు, ధర్మమును మనకుజూప స్వామి యవతార మెత్తుదురు యని విస్తారముగా మహాస్వాములవారు. ఉపన్యసించి విరమించిరి.

— ౦ —

## ౯. దేవాలయములో నుండు, శిలాదులపై చెక్కిన వ్రాత.

మన దేశమందుండు పురాతన దేవాలయగోడలలో యేదో వ్రాయబడి యున్నది. ఆలిపి చక్కగా కనబడుటలేదు. గర్భ గృహాములలోనున్ను ప్రాకారములలోనున్ను యీలిపి కనుబడు చున్నది. దానిలో నేది వ్రాశియున్నదియు తెలుసుకొననివారు నిధియుండు స్థళము, గోడలలో వ్రాయబడి యున్నదిగా చెప్పు కొనుచున్నారు. కొన్ని గ్రామములందుండు దేవాలయము లలోనున్నా వ్రాయబడి యున్నది. మనము వాటిని తెలుసు కొనుటకు ప్రయత్నము చేయుటలేదు. వాటిని మనము గమ నించుటయులేదు. గమనించినను నవి తెలియుటలేదు. దేవాలయ

ములు నెందుకు కట్టబడియున్నవి. వాటికి నాధారమైన గ్రంథ ములు యేవియనియు మనకు తెలియదు. అయితే నేమతస్థులకు గాను యీ దేవాలయములు నేర్పడి యున్నవో, ఆమతస్థులే మనము. ఇతర మతస్థులు యీ విధమైన యశ్రద్ధగలిగిన వారు గారు. వేదమేమి, పురాణమేమి, ఆగమమేమి, ధర్మశాస్త్ర మేమి యనుట మనకు తెలియదు. ఎందుకుమనము వూర్ధ్వ పుండ్ర ముధరించుకొని యున్నాము. లేక యెందుకు విభూది పూసుకొని యున్నాము, లేక నెందుకుయజ్ఞోపవీతము ధరించుకొనియున్నాము యను కారణములను మనము తెలుసుకొనుటలేదు. మన మతా నుష్ఠానములలో దిద్దుపాటు చేయ కోర్కెగలవారుకూడ యీవిష యములను తెలుసుకొని పిమ్మట ద్దిదుపాటుజేయ ముందుకొచ్చి నయెడల చక్కగా నుండును. మతగ్రంథములను జదివినవారు లౌకికవిషయములను తెలియని వారుగానున్నారు. చదవనివారు తీవ్రమైన వేగముగల వారై యున్నారు. వారున్ను చదివిన యెడల చక్కగా పనిజేయనౌను.

ఇతర దేశములలో ప్రబలమైన వారు జనులయొక్క యభి ప్రాయమునే నెత్తి జెప్పుచున్నారు. జనులయొక్క యభిప్రాయ ములున్ను, అనుష్ఠానమున్ను నొకటి, వ్యాపకస్తులయొక్క యభి ప్రాయమున్ను, అనుష్ఠానమున్ను వేరని యితరమతస్థులలో లేదు.

కాన వారు ప్రారంభించిన కార్యము ఫలితమాచున్నది. మన మతమందు జనులకున్ను, వ్యాపకస్తులకున్ను సంబంధములేదు.

మనజనులలో 100,కి 95, మంది తీర్థయాత్ర, శ్రాద్ధము, దేవాలయము, సుజాతి వివాహముయను వాటిని యనుష్ఠించు వారు. మన వ్యాపకస్తులకు నీవిషయములలో నమ్మకములేదు.

దిద్దుపాటు జేయువారును, అనుష్ఠానము జేయువారును, గ్రంథములను పఠించిజూడవలెను. బౌద్ధము, చండమారుతమును పోలివీచినను మనమతము యట్లేయున్నది. దానికారణమేమి? మనమతమును చక్కగాపరిశీలించివనే స్పష్టమాను. అట్లు తెలిసి కొన్నవారు జననాయకులుగా వచ్చినయెడల వారు ప్రారంభించు కార్యమునకు ఆదరముండును. గ్రంథములనుపఠించి విషయము లను తెలుసుకొన్నవారిపై కోపగించక వాటిని పఠించవలెను. మనకు నేర్పడియున్న ఆచారములు నేమియని తెలుసుకొన వలెను. అది తెలుసుకొని, అనుష్ఠానముజేసుకొని మాత్రము నుండ కూడదు. సాముదాయిక కార్యములయందు పాటుపడవలెను. మహారాష్ట్రులు యుద్ధభూమియందును మాధ్యాహ్నికమును, శివపూజయు విడువలేదు. మహత్తరమైన యుద్ధకాలమందు రంగ స్థళమందు తమపూర్వీకులు పూజించిన మూర్తియని తంజావూరి లోననేకులు నాకు తమ గృహమందుండు మూర్తులను జూపి యున్నారు. ఎన్నియో వేలు సంవత్సరములుగా వచ్చియుండు

కర్మములను.  మనకు 100 రూపాయిలు జీతమైననెడల, చేయు
టకు వీలులేదని చెప్పుట గొప్పవిపరీతము. ఉద్యోగము తనను
ఆకాశముపై నెగరవేయునట్లు తలంచుకొనకూడదు మనమతము
లయొక్క ఆచారములను జనులు దెలుసుకొని రాజకీయకార్యము
లలో నెపుడు పాటుపడుదురో నపుడే కృతకృత్యులౌదురు. ఇతర
మతస్థులు రెండు సంవత్సరములైనను తమయొక్క మతవిద్యను
పఠించుచున్నారు. మతశాస్త్రములను మనము యెంతగా తెలుసు
కొనలేమో అంతగా వాటినిబట్టి నభిప్రాయముజెప్ప యోగ్యత
గలవారమని తలంచుకొనుచున్నాము. మనకలాశాలలో చదువు
చున్న బాలురు మనశాస్త్రములంటే దీర్ఘప్రణామము చేయు
చున్నారు. ఈస్థితిపోవలెను. మన దేవాలయముల గోడలమీద
వ్రాసియుండినది చదువుటకు మీరు తెలుసుకొన్నయెడల నేను
చెప్పునది ఆమోదించగలరు.

దేవాలయవ్రాతను పఠించ నేను శిలాశాసన పరిశోధన శాఖ
వల్లనే తెలుసుకొంటిని. దేవాలయములందు పొందింపబడ్డ శాస
నములనెల్ల వారుపఠించియున్నారు. అయితే విషయములనెల్లను
మనకు తెలియచేయలేదు. దేవాలయగోడలెల్లను సబ్ రిజిస్ట్రారా
ఫీసు. పూర్వము వాడు వాడుజేసిన దానధర్మములు దేవాలయ
ములకునిచ్చిన సొత్తుమొదలైన, వివరములు దేవాలయగోడలపై
పొందింప బడియున్నవి. ఒకసొత్తును నొకడు దేవాలయమునకు

వ్రాసియిచ్చిన తదుపరి రాజునకు తెలిపినయెడల సాసాత్తును, "పన్ను లేనిదిగా" జేయుదురు. ఒక్కొక్క గ్రామమున్ను నొక ప్రజాప్రభుత్వముగా యుండెను. కొన్ని సభలు నిర్వహించుచూ వచ్చిరి. జనులయొక్క ఓట్ (అభిప్రాయము) ప్రకారమే గ్రామనిర్వాహము నడిపించుచూ వచ్చెను. ఒట్ వేయుటకు "తాటిపత్రమెత్తుట" యనిపేరు. ఉత్తరమేరూరు, దేవాలయ గోడలపై, సభావిధులు పూర్ణముగా చెక్కబడియున్నవి. "వేద మందును మంత్రబ్రాహ్మణ మందును ప్రవీణత గలవాడే" సభ్యుడుగా యెన్నుకోబడియుండెను. వానియొక్క బంధువులలో నెవరున్ను మహాపాపము యేదేని చేసియుండకూడదట; బంధువులుపాపము జేసియున్నయెడల, యెన్నికలలోజేరుటకు యర్హుడు కాడు. ఒక్కొక్క ఆలయమునకు సమీపమందు, చతుర్వేది మంగలంయని యుండెను. అందులో బ్రాహ్మణులు వశించి యుండిరి. శివభక్తులో, విష్ణుభక్తులో దేవాలయ కోశాధ్యక్షుడు గానుండియుండిరి. వారికి శ్రీపండారత్తారనిపేరు (పండారము= బొక్కసము). అగ్రహారమునకు ప్రక్కన పండారవాడయుండెను, చతుర్వేది మంగలమందు 4, 5 సభలుండెను. ఒక్కొక్కటి నొక్కొక్క కార్యమునకు యేర్పడినది. వారు "సభయోం" అని సంతకముచేయుట వాడుక. వర్తకులుకూడి వసించినస్థళము నకు పేటయనిపేరు. యుద్ధవీరులయొక్క వాసస్థలము పాల

యము. రాజులు, మరవలు, పడయాచ్చులు, నాయకులు, మొద లగువీరులు, పాళయములలో వసించియుండిరి. ఉడై యార్ పాళ యముయనునది నొక ఉదాహరణము. అగ్రహారమనునది, ఒక కొనలో శివునిదేవళమున్ను, యింకొకకొనలో విష్ణుకోవెలయున్ను గలిగినవీధి. "అగ్రం" అను సంస్కృతపదమునకు కొనయని యర్థము. ఇటులనే వృత్తిసంస్కారమేర్పడి గ్రామముయొక్క కార్యములు సాగుచుండెను. శాసనములలో "యివ్వూర్ సభయోం" అని కొన్ని బ్రాహ్మణులు, కరణము, శ్రీపండా రత్తార్, అయిన వారుసంతకము చేసియుండుట మీరుచూడ నౌను. రాజుయొక్కఆజ్ఞను వారుగ్రహించిన దానికి అదిగురుతు. రాజుఆజ్ఞలో "రాగియందును, రాయియందును, చెక్కకొనుడు గాక" అని వ్రాయబడియుండును. దానిని వ్రాసిపంపిన వుద్యో గస్థులకు "తిరుమందిరవోలై" అని పేరువ్యాపించెను. ఈకాల మందు అంతరంగకార్యదర్శి యనుచున్నాము. ఆనాటియాజ్ఞనందు ఆజ్ఞలను వారువ్రాసినందున, తిరుమందిరవోలై, అనిపేరుగలిగెను. మందిరమను పదమునకు, రాజుయొక్క భవనమని, అర్థము. మన దేశమందు సమస్తవిధములైన రాజ్యాంగములు వుండెను. గ్రామ ములు పూర్తిగా ప్రజాప్రభుత్వము గలదై యుండెను. గాన వాటి నిర్వాహములలో రాజుకు జోక్యములేదు. పన్నును వసూలు జేసి దేశక్షేమమునకు వ్యయపరచవలసినదే వారియొక్క పని.

ప్రజాప్రభుత్వ సభాధ్యక్షులు యెల్లరును యెన్నుకోబడినవారు. నియమించుటయే లేకయుండెను. ఇతర పనిలేనియెడల, రాజులు దానధర్మములను జేసుకొనుచుందురు. దేవళమునిర్మించి, తటాకముత్రవ్వించి, సత్రము నేర్పరచి, పాఠశాలస్థాపించి, జనులకు హితమైన కార్యములను వారుసల్పుచూవచ్చిరి. నవరత్నకిరీటము ధరించిన రాజులు బీదబ్రాహ్మణుని గౌరవింతురు. కనుక, బీదవాడు గౌరవనీయుడుగానున్న, ధనికుడు సామాన్యుడుగానున్న, భావింపబడిరి. ఈకాల, యభేదవాదప్రకారమైతె యెల్లరున్ను బీదలుకావలసినదే! ఆకాలమందు దుర్భిక్షమనునది నధికముగాలేదు. రానుపోను సౌకర్యములు అధికమైన పిమ్మటనే లోకమందెక్కడ చూచినయెడలను యేకాలమందున్న దుర్భిక్షముయొక్క కష్టము యనుభవించబడును. ఇక్లెల్లను వుండినది గోడలపై వ్రాయబడియున్నందున తెలుసుకొనగలము.

పూర్వపు శిలాశాసనములను జూచినయెడల, "స్వస్తిశ్రీ" అని సంస్కృతములో ప్రారంభముజేసి, యీరాజుయొక్క ఫలానాసంవత్సరములో, ఫలానామాసములో, ఫలానా తేదియందు, రాజు ఫలానాకార్యము చేయుచుండగా ఫలానావారు ప్రార్థించిన రీతిగావుత్తరవు జేసిరనిజెప్పి యాజ్ఞపూర్తిగా వ్రాసియుండును. ఇటులజనులును, రాజ్యాంగములును దానముజేసినందున దేవాలయములు సంరక్షింపబడుచు వచ్చుచున్నవి. ఆదేవాలయము

లనుబాగుజేయుటకును నిపుడు మనవలన గాకయున్నది. పూర్వ దినములలో నాయాగ్రామమువారు వారిజీవనమునుజేయుచు దేవాలయమున్నూ కట్టుచూవచ్చిరి. శిలాశాసన పరిశోధన శాఖోద్యోగస్థులు యీశాసనములనెల్లచదివి నకలు వ్రాసుకొనుచున్నారు. అయితే యేశాంతినుద్దేశించి యింతద్రవ్యము వ్రయము చేయుచు వచ్చిరి యనుట వారుగమనించుటలేదు. ద్రవ్యము బుద్ధి రెండును విశేషముగా వ్రయముజేసి పూర్వీకులు పొందినఫలమును మన మెందుకు పొందకూడదు?

గోడలపై వ్రాసియున్న దానికెల్లను రాజుయొక్క శ్రీముఖ మనిపేరు.

మనయాచార్యుల తాళపత్రములకున్నూ, శ్రీముఖమని వాడబడుచూవచ్చినది. కనుకనే మేముయేదేని వ్రాసిపంపిన యెడల శ్రీముఖము వచ్చినదని యనుచున్నారు. మనయాచార్యులు 56 దేశపురాజులవల్లను సన్మానింపబడినవారు. 32 డేండ్ల వయస్సువరకే వారుండిరి. 12 డేండ్లవయస్సునకుపైన లోకసంచారము చేసినట్లు భావించినను 20 సంవత్సరములలో భరతఖండమందుండు 56 దేశములకుపోయి యచ్చటచ్చట వేదవిరుద్ధమైన యభిప్రాయముగల పండితులనుజయించి దుర్మతముల బారదోలి యద్వైతమును స్థాపించిరి. అద్వైతమతముతప్ప వేరుమతము లేకుండా చేసివిడిచిరి. ఇప్పుడుండుద్వైతము, విశిష్టాద్వైతము,

మొదలగు సిద్ధాంతములు, మన యాచార్యుల కాలమునకు పిమ్మట యేర్పడినవి. వారియొక్క కాలమందు 72 దుర్మతము లుండినవట. వాటిలో నొక్కటియైనానిప్పుడులేదు. అట్లుచేసిన వారివల్ల స్థాపింపబడిన మతము, మనదని జనులకభిమానమేర్పడి యది రక్తమందూరిపోయి యున్నది. వారి నామముయొక్క మహిమ దానికి కారణము. మనయాచార్యులయొక్క బిరుదు లలో " నిఖిలపాషణ్డషణ్డ ఖణ్డగోత్కాడనేన, విశదీకృత వేద వేదాంతమార్గషణ్మత ప్రతిష్ఠాపకాచార్యాణా " మనియున్నది. వేదవేదాంత మార్గమందు పూర్వమువలెయున్న యనేకపాషండ మతములను ఖండించి షణ్మతస్థాపనము చేసినవారనునది దాని యర్థము. వారుస్థాపించిన వేదమార్గము, వేదాంతమార్గములను, రెండు మార్గములను, మేము దేశీయులకు, యుపదేశముజేయ భాధ్యులమైయున్నాము. వేదాంతము జదివినను యాశవిడ లేదు, చెడుతలంపుపోలేదు. వేదాంతముజదువుటచే పొందతగిన ఫలమునుపొంద, పక్వమేర్పడునట్లు వైదికకర్మలను జేయవలెను. చేయునపుడు ఫలమునెదురుచూచి చేయకూడదు. లౌకిక కర్మల నున్ను నవ్విధముననే జేయవలెను. ఇతరదేశస్థుల యభిప్రాయ ములకుభయపడక మనశాస్త్రములయొక్క యభిప్రాయములను వారొప్పుకొనునట్లు మనముచేయవలెను.

— o —

## ౧౧. జ్ఞానాంబికా.

శివుడు, విష్ణు, యంబిక, విఘ్నేశ్వరుడు యను స్వాములను గురించే పురాణములును ఆగమములును జెప్పుచుండునే గాని, వేదము యధికము జెప్పలేదని ఇంగ్లీషుజదివినపద్ధతిలో పరిశోధన జేయు వారు జెప్పుచున్నారు. శివుడు, విష్ణువు మొదలగు దేవతలను, పురాణములలో గొప్పగా జేసి విడిచిరని వారు జెప్పుచున్నారు. ఇటుల వారు జెప్పుటసరి, లేక, తప్పుయని జెప్పువారు లేరు. కాన, వారియొక్క యభిప్రాయము తీర్మానమగుచున్నవి. కనుక నీపక్షమునకు యాక్షేపణలేదని వారు తలచుకొనుచున్నారు. ఈయభిప్రాయము తప్పుయయినయెడల, దానిపై జేయు తీర్మానమున్ను తప్పిపోవును. వారు జెప్పునది తప్పుయని తలంచువారు మౌనముగా యుంటున్నారు. వేదముయొక్క జ్ఞానభాగము ఉపనిషత్తులు. ఆయుపనిషత్తులలో యాత్మయనియు, బ్రహ్మమనియు జెప్పబడియున్నదేగాని శివుడనియు, విష్ణువనియు జెప్పలేదు. కర్మకాండమందు జెప్పబడియున్నను; ఇంద్రుడు, వరుణుడు మొదలగు దేవతులవలె వారున్ను జెప్పబడియున్నారేగాని, వారు పరమాత్మయని జెప్పబడలేదనుచున్నారు. దేవతులసమూహమందు శివవిష్ణువులున్ను యున్నారని నొప్పుకొననానేగాని, వారిని పరమాత్మనిగానెన్న తగదనుచున్నారు. బ్రహ్మసమాజము, ఆర్యసమాజము

యనునవి యిట్లు తలచుచునేశివునిన్ని విష్ణువునున్ను విసర్జించిరి. ఆసమాజములునేర్పడి సుమారు 100 సంవత్సరములు గడిచినవి.

ముఖ్యమైన నుపనిషత్తులలో జగమును సృష్టించిన వస్తువు గురించిజెప్పునపుడు, ఆత్మయనియు, బ్రహ్మయనియు మాత్రమే చెప్పబడియున్నది. ఉపనిషత్తులు 108 అనిచెప్పబడును. వాటిలో నొక్కొక్క దేవుని కొక్కొక్క యుపనిషత్తు ప్రత్యేకముగా యున్నది. అయితే వాటిని ప్రస్తుత కక్షిదారులొప్పుకొనరు.

మనయాచార్యులును 10 యుపనిషత్తులకేభాష్యము చేసి యున్నారు. ద్వైతమతమధ్వాచార్యులున్ను యద్వైతమతమన యాచార్యులున్ను 10 యుపనిషత్తులకు భాష్యముజేసియున్నారు. శ్రీరామానుజులు నుపనిషత్తులకు ప్రత్యేకముగా భాష్యముచేయ లేదు; ఇతర గ్రంథములలో 10 ముఖ్యమని యంగీకరించి యున్నారు. ఈశ, కేన, కఠ, ప్రశ్న, మాండూక్య ముండక, తైత్తిరీయ, బృహదారణ్యక, ఛాందోగ్య, సుబాలయనువది. మొదటియుపనిషత్తు యీశావాస్యమనబడును. ఈశయను శబ్ద మందులో మొదటిగావచ్చుటవలన యది యీశావాస్యమని జెప్ప బడుచున్నది. రెండోయుపనిషత్తు కేనము. ఆత్మయవరు, అది గుణమును గ్రహించినప్పుడు దానిపేరేమి, స్వరూపమేమి ? రూప నామములేదనగా బ్రహ్మయనిజెప్పనౌను. అయితే యనుగ్ర హార్థము రూపము గ్రహించునపుడు దానిపేరేమి, రూపమేమి

యని కేనోపనిషత్తు జెప్ప ప్రారంభించి యొకకథను జెప్పియున్నది. కథయేమనగా నొకానొక కాలమందు దేవతలకున్ను, యసురుల కున్ను యుద్ధమునడచెను. పరమాత్మ దేవతలకు సహాయముగా యుండిరి. దేవతలు జయముపొందిరి. పరమాత్మ వారికిసహాయము జేసినది వారికి తెలియదు. జయము పొందినతోడనే దేవతలుగూడి తమయొక్క జయమును కొనియాడిరి. అప్పుడు వారు తమ్ము మెచ్చుకొనిరి. అహంభావమువలన యసురగుణమును వారుపొందు దురని భగవంతుడుతలచి వారలకు సద్బుద్ధి యంకురించుటకు, కొంతదూరములో నొక పెద్దస్వరూపముగా తామునిలిచిరి. దాని పాదము, శిఖయనునేదియు దేవతలకు దెలియలేదు.

అదియేదైనది వారికి తెలియలేదు. ఆరూపమునకు యక్షమని పేరు. దేవతలలో శక్తియధికముగల యగ్నిని, నాయక్షునివద్దకు, వారుపంపి, యదియేమని తెలుసుకొనిరమ్మని జెప్పిరి. అగ్ని సమీప మునకు పోవుటకుముందు యాయక్షమే వారినిజూచి "నీవెవ" రనియడిగెను. "నేనగ్నిని, నాకుజాతవేదసుడని పేరుగలదు" అని యగ్ని జెప్పిరి. "నీయొక్క శక్తియేమి", అనియక్షమడిగెను. "నేనుదేనినైననుకాల్చి భస్మముచేసివిడుతు" ననియగ్ని జెప్పిరి. "అటులైతే దానిని దహించు" మని యక్షముజెప్పి యొకతృణ మును వారిపైవేశినది. తనయావచ్ఛక్తి నుపయోగపరచినను యగ్నికి నాతృణమునుదహించ శక్యముగాకపోయెను. దానిపై

వారు లజ్జపొంది దేవతులవద్దకు మరలివచ్చి జరిగినవిషయమును జెప్పిరి. దానిపై దేవతలు వాయువును యక్షునివద్దకంపిరి. వాయువును యక్షుడడిగిన ప్రశ్నమునకు, తానుదేనినైనను, జగత్తునుగూడ యెత్తుకొని పోవగలుగునని వారుబదులుజెప్పిరి. ఒకతృణమును వారిముందు యక్షమువేసి దానిని యెత్తమనిజెప్పెను. వాయువువల్ల సాధ్యముగాకపోయెను. వారును మరలిపోయిరి. అందుపై దేవరాజైన ఇంద్రుడేబోయెను. అప్పుడు యక్షము యంతర్ధానమాయెను. ఇంద్రుడు దానింగానక కలవరపడి యుండగా, "ఉమా, హైమవతి", వానియెదుట దివ్యమంగళ స్వరూపినిగా తోచెను. జగన్మాతను దర్శనముజేసినతోడనే యహంభావము నిర్మూలమై ఇంద్రుడు నమస్కారముజేసి, యిచ్చటనొకరూపము నిలిచియుండెనేయది యేమనియడిగెను. "మీరు చూచినదియే పరమాత్మ" యని తెలియజెప్పె నంబిక. సర్వజ్ఞుడైన నీశ్వరునితో యంబిక కలిసియున్నదని యాచార్యులిచ్చట వ్యాఖ్యానముజేసి యున్నారు. కేనోపనిషత్తున నీకథ జెప్పబడి యుండుటలో "హైమవతి" యను పదముపయోగింప బడియున్నందున హిమాచలతనయ యంబికయను పురాణకథను యీయుపనిషత్తు యాదరించుచున్నదనునది తెలియుచున్నది. పురాణములు వేదార్థమును దెలుపుచున్నవి. ప్రస్తుతకథను తెలుపుటకొక పురాణమున్నది. నేనుకాళహస్తికి పోయియున్నపుడు, గిరి ప్రదక్షిణమును

జేసుకొని వచ్చుచుండగా యర్థమార్గమందు యొక కొండనెక్కి నచ్చట యొకవనమందుండు యొకశివలింగమును దర్శించవలెనని జెప్పిరి. ఆలింగము సహస్రలింగము. అందులోనుండు 1008 లింగ ములలో నొకటి తెల్లగానున్నది. దానిపేరు యక్షేశ్వరులు. ఇంద్రలింగమని యొకలింగమున్నూ యున్నది. ఆపురాణములో యక్షమున్నస్థళము, దేవతలు సమూహాముగ కూడినస్థళము, మొదలగునవి యన్నియు జెప్పబడియున్నవి. దేవతలు జూచిన స్వరూపమే పరమేశ్వరుడని యంబికే వారికి జ్ఞానోపదేశము జేసినది గనుక కాళహస్తియందంబికకు జ్ఞానాంబికయని పేరేర్పడి యున్నది.

శివుడని, విష్ణువని, యంబికయని వేదముయొక్క జ్ఞానకాండ లోచెప్పబడియుండలేదనియు, పురాణములు సాధారణ దేవతలను గొప్పగాజేసి విడిచెననియు, జెప్పుచున్నవారు, కేనోపనిషత్తులో జెప్పబడినది గమనించి యథార్థమును దెలుసుకొనవలెను. ఒక విద్వాంసుడు జెప్పియుండెనని నొకదానిని నమ్మకూడదు. గురు ముఖముగా యధ్యయనముజేసి పఠించిన పెద్దలు పలువురుజెప్పు నదే సరియని తీసుకోవలెను. సీమలో సర్ ఆలివర్ లాడ్జియను గొప్పవిజ్ఞాన పండితులు, గతించిపోయిన పిమ్మట గూడజీవమున్న దనిజెప్పుచున్నారు. దానిని యితరవిజ్ఞాన పండితులొప్పుకొనలేదు.

అవ్విధముగనే మనమున్నా యొకవిద్వాంసుడొకదానిని జెప్పు మన్నారని దానిని తీసుకొనకూడదు.

దీర్ఘముగా నవలోకించవలెను. పరబ్రహ్మమొకసమయ మందు లక్ష్మీసమేతుడు, నొకసమయమందు యంబాసమేతులు, నొకసమయమందు సరస్వతీసమేతులని జెప్పబడియున్నది. పార్వ తియు పరమేశ్వరుడును పరబ్రహ్మము; లక్ష్మియు విష్ణువును పర బ్రహ్మము; సరస్వతి బ్రహ్మయును పరబ్రహ్మము. ఒక్కొక్క స్థళమందొక్కొక్క భావమధికముగా జెప్పబడియున్నది. తక్కి నదిలేదని పెట్టుకొనగూడదు. ఒక దృష్టాంతము జెప్పుచున్నాను.

నీలకంఠదీక్షితులని మధురలో తిరుమలనాయనివద్ద మంత్రి గాయుండిరి. వారికాలములోనే, తిరుమలనాయని మంటపము కట్టబడినది. ఆరణికి సమీపమందున్న నడయపలము వారిస్వంత గ్రామము. తంజావూరిజిల్లాలోచదివి విద్వాంసుడై మధురలో నుద్యోగములో నుండిరి. వారొకశ్లోకమందు "ఒక కావ్యము యొక్క యలంకారమును జూడగ, సరస్వతియొక్క బొక్కసము రిక్తమైయుండవలెనని తోచుచున్నది. అయితే సరస్వతియొక్క బొక్కసమునుజూడగా కొండలు గొండలుగానుండు రాసులలో కావ్యముయొక్క రసమొక చిన్నమాటయని తెలియుచున్న" దని జెప్పియున్నారు. కావున నొకసందర్భములో నొకభావము నధికముగా జెప్పియున్నందున, యావల వేరులేదని తలంచుకొన

కూడను. ఈనీలకంఠదీక్షితులు "తిరువిళైయాడల్" పురాణమును సంస్కృతములో జేసియున్నారు. దానిని వారు యంకితముజేయునపుడు "నాయొక్కయాత్మను మలయధ్వజ పాండ్య కుమార్తెయొక్క చరణములకు యర్పణము జేసివిడిచితిని. ఈ గ్రంథమును నిద్దరికిన్ని యర్పణము చేసివిడిచితిని". యనిజెప్పియున్నారు. కాళహస్తి జ్ఞానాంబమొదలుజేసి మధురమీనాక్షి వద్దకువచ్చి వేశినాము.

శ్లో॥ పశ్యేయమే కస్యకవేః కృతిశ్చేత్
సారస్వతం కోశమవైమిరిక్తం।
అంతః ప్రవిశ్యాయమవేక్షితశ్చేత్
గోష్ఠేప్రవిష్టా కవికోటిరేషా॥
మలయధ్వజ పాండ్యకన్యకా చరణద్వంద నివేశితాత్మనా
శివయోః కవినేదమర్పితం శివలీలార్ణవ కావ్యమద్భుతం॥

మన దేశమందు పుస్తకముల నర్పణము జేయుటకూడ స్వామికే జేయుచూవచ్చిరి. తోటవేయుట స్వామికే. అనేకులు కూర్చొని గ్రామ వృథామాటలాడు కొనుటకు వేయబడినది గాదు. ఈకాలపు వుద్యాన వనములోనుండు వృక్షములయందు పరిమళముగల పుష్పములులేవు, ఫలములున్ను లేవు, స్వామికిని లేవు, మన పొట్టకునులేవు. మన దేశసంగీతమున్ను యీశ్వరార్పణమే. పద్యములెల్లను యీశ్వరునిపైననే శిల్పశాస్త్రజ్ఞానము

దేవళములుకట్టుటకే యుపయోగింపబడి యున్నది. ఇటువంటి జ్ఞానమునకెల్ల నివాసస్థళమైన జ్ఞానాంబిక యుపనిషత్తులలో దివ్య మంగళస్వరూపిణిగా ప్రకాశించుచున్నది. ఆమెను ధ్యానముజేసి యనుగ్రహము బొందెదముగాక యని స్వాములవారు జెప్పివిరమించిరి.

— ० —

## ౧౧. శక్త్యానుసార స్వల్పధర్మము.

మనధర్మమును పరిపాలించుటకు మనమతమందు రాజులు లేరు; కనుక జనులేశ్రద్ధను తీసుకొనవలెను; అయితే వారికి శక్తి లేదు. అయినప్పటికిని ధర్మములు క్షీణించునట్లుగా మనము విడువకూడదు. ఉన్నశక్తికొలది సాధ్యమగువరకు చేయవలెను. ఒక్కొక్కడున్ను వానియొక్క జీవితకాలములో నొక్కధర్మమైన జేయవలెను. కొద్దిగానైనను జేయవలెను. కోటిజనులట్లు జేసినయెడల ధర్మమునకు కొరతయేయుండదు. పురుషులొక్కొక్క రొక హుండిడబ్బాపెట్టి యందులో నిత్యము కానియోలేక శక్తికి తగినట్లేదో వేయుచూవచ్చిన యెడల 20 సంవత్సరములు గడవగా గొప్పధర్మము చేయనౌను. స్త్రీలున్ను నిత్యము కొద్దిగాబియ్యమో లేక వేరేదైననో వేయుచూ వచ్చిన యెడల నదియు పెరిగి పోవును. నేడు శుక్రవారమైనందున యిదిజెప్పవలెనని దలచినాను.

ధనికులుగానున్న వారు విశేషముగా జేయనీ, బీదవాడొక్కపైస యైనను ప్రత్యేకముగానుంచనీ. అప్పుడు మనమతస్థులగు రాజులు లేని కొరతయుండదు. వారివారికి యేదియుత్కృష్టమని తోచు చున్నదో యాధర్మమును జేయనౌను. అట్లుజేసినయెడల మన యంత్యకాలమందు మనస్సునం దానందముండును.

మనయాచార్యుల యాజ్ఞప్రకారము, వచ్చినవారి కేదేనియుప దేశముజేయ బాధ్యత గలిగియున్నందున పదేపదేజెప్పుచున్నాను. నేనొకటి జెప్పుటకంటెను వారియొక్క వాక్కునే జెప్పుటనుత్తమము గనుండును. వారియొక్క వాక్కునేజెప్పినయెడ, వారుచెప్పినది విని నట్లుగానుండును. వారు రచించిన గ్రంథములెల్లను శ్రీరంగపు వాణీవిలాసము దాక్షిశాలచే " శాంకర గ్రంథావళి " యని నచ్చు వేయబడియున్నవి. వాటిలోనొకటి " ప్రశ్నోత్తర రత్న మాలిక ". ప్రశ్నయనగా యడుగుట, ఉత్తరమనగా సమా ధానము, కనుక ప్రశ్నలున్ను నుత్తరములున్నాయగు రత్న మాలయనునది దానియర్థము. ఈమాలను కంఠములోధరించిన వారెవరు యలంకారము పొందలేదుయను నొక శ్లోకమున్నది. రుద్రాక్షమాల, తులసిమాల మొదలైనవి కంఠమునకు పైన ధరించుకొనబడునవి. ఈమాలను కంఠములోపల ధరించుకొన వలెను, మనస్సులో స్థాపించవలెను. ఆప్రశ్నోత్తరములు వరుసగా జెప్పుచున్నాను.

# " ప్రశ్నోత్తర రత్నమాల. "

శ్లో॥ కఃఖలునాలం క్రియతేదృష్టా • దృష్టార్థ సాధనపటీయాన్
అముయాకంఠః స్థితయా ప్రశ్నోత్తర రత్నమాలికయా॥ ౧.

తా॥ ఇహపరశ్రేయస్సును పొందు సామర్థ్యముండుయే వాఁకరు
యీప్రశ్నోత్తర మాలికను మనస్సున గ్రహించి దీనిచే
యలంకరింపబడలేదు ?

శ్లో॥ భగవన్కిముపాదేయంగురువచనం • హేయమపిచకిమకార్యం
కోగురురధిగతతత్త్వః • శిష్యహితాయోద్యతః సతతమ్॥ ౨.

ప్ర॥ ఓస్వామి ! గ్రహించతగినదేది ?

ఉ॥ గురువచనము.

ప్ర॥ విసర్జించవలసిన దేది ?

ఉ॥ అకార్యము.

ప్ర॥ గురు వెవ్వరు ?

ఉ॥ యదార్థమును దెలిసినవారు, తమ్మాశ్రయించిన శిష్యుల
క్షేమమును కోరువారు.

శ్లో॥ త్వరితః కింకర్తవ్యంవిదుషాం • సంసార సంతతిచ్ఛేదః ।
కింమోక్షతరోర్బీజం • సమ్యక్ జ్ఞానం క్రియాసిద్ధమ్॥ 3.

ప్ర॥ త్వరితముగా జేయవలసినదేది ?

ఉ॥ సంసారపరంపరను ఛేదించుట ( చచ్చిజచ్చిపుట్టక మోక్ష
మును పొందుట ).

ప్ర॥ మోక్షవృక్షమునకు బీజమేది ?

ఉ॥ ఉన్నదున్నట్లు తెలుసుకొని క్రియారూపున చూపుట.

శ్లో॥ కఃపథ్యతరోధర్మః ♦ కఃశుచిరిహ యస్యమాన సంశుద్ధం ।
కఃపండితోవివేకీకిం ♦ విషమవధీరణా గురుషు॥ ४.

ప్ర॥ ఏది పథ్యము ? ( హితమైనది )

ఉ॥ ధర్మము.

ప్ర॥ ఎవడు శుద్ధుడు ?

ఉ॥ ఎవనిమనస్సు శుద్ధముగానున్నదో వాడు.

ప్ర॥ ఎవడు పండితుడు ?

ఉ॥ వివేకీ ( వివేకము గలిగినవాడు ).

ప్ర॥ ఏది విషము ?

ఉ॥ పెద్దల వాక్యము నలక్ష్యముజేయుట.

శ్లో॥ కింసంసారేసారం బహుశోఽపి ♦ విచింత్య మానమిదమేవ ।
కింమను జేష్విష్టతమం ♦ స్వపరహితా యోద్యతంజన్మ॥ ౫.

ప్ర॥ సంసారమందు సారమేవి ?

ఉ॥ తరుచుగాదీనిని తలచుకొను చుండుటే,
( సంసారమందు సారమేమని నాలోచించుచు యుండుట
వల్లబంధమువీడి జననమును ఛేదించనౌను. )

ప్ర॥ మనుజులు కోరవలసినదేది?

ఉ॥ తాను, పరులు, యుభయుల క్షేమమునకుగాను నుప యోగింపబడు జన్మము.

శ్లో॥ మదిరేవ మోహజనకః కః స్నేహః ♦ కేచదస్యవోవిషయాః।
కాభవవల్లీ తృష్ణాః ♦ కోవైరీ యస్తనుద్యోగః॥ ౬.

ప్ర॥ కల్లువలె మైకము కలుగజేయునది యేది?

ఉ॥ అభిమానము. ( ఆశ, స్నేహము )

ప్ర॥ దొంగలెవరు?

ఉ॥ ఇంద్రియముల నీడ్చుకొనిపోవు విషయములే.

ప్ర॥ సంసార తీగయేది?

ఉ॥ ఆశయే.

ప్ర॥ శత్రులెవరు?

ఉ॥ సోమరితనమే.

శ్లో॥ కస్మాద్భయమిహమరణా ♦ దన్ధాదిహ కోవిశిష్యతేరాగీ।
కశ్శూరో యోలలనాలోచన ♦ బాణైర్నచ వ్యథితః॥ ౭.

ప్ర॥ ఎల్లరును భయపడునది యేది?

ఉ॥ మరణము.

ప్ర॥ గుడ్డివానికన్నను గుడ్డివాడెవడు?

ఉ॥ ఆశగలిగిన వాడు.

ప్ర॥ శూరుడెవడు ?

ఉ॥ దుర్మార్గమందు మనస్సుపోకుండా నిగ్రహించువాడు.

శ్లో॥ పాతుం కరణాంజలిభిః । కిమమృతమిహ యుజ్యతే సదుః
దేశః। కింగురుతాయామూలం। యదేతద ప్రార్థనంనామ॥ ౦

ప్ర॥ చెవియను దోసిలితో త్రాగదగిన యమృతమేది ?

ఉ॥ సాధువులయొక్క యుపదేశము. ( రెండుచేతులను దొన్నె వలె జోడించుట యంజలి, చెవిదొన్నెవలె వంగియుండుట వల్ల నంజలియని జెప్పబడియున్నది. )

ప్ర॥ గౌరవమునకు మూలమేది ?

ఉ॥ ఒకరినేదైనను నడుగకయుండుట.

శ్లో॥ కింగహనం స్త్రీచరితంకః । చతురోయోన ఖండితస్తేన।
కిందుఃఖమ సంతోషః । కింలాఘవ మధమతోయాఞ్చా॥౯

ప్ర॥ కొలుచుటకు శక్యముగాని దేది ?

ఉ॥ స్త్రీలయొక్క నడత.

ప్ర॥ సమర్థుడెవడు ?

ఉ॥ స్త్రీలయొక్క నడతవల్ల వంచింపబడనివాడు.

ప్ర॥ దారిద్రమేది ?

ఉ॥ అసంతుష్టి.

ప్ర॥ నీచత్వ మేది ?

ఉ॥ తక్కువవారిని యాచించుట.

శ్లో॥ కింజీవిత మనవద్యం కింజాడ్యం ♦ పాఠతోప్య నభ్యాసః ।
కోజాగర్తి వివేకీ ♦ కానిద్రా మూఢ తా జంతోః ॥౧౦.

ప్ర॥ ఉత్తమమైన జీవనమేది ?

ఉ॥ నిర్దోషమైనది.

ప్ర॥ అవివేకమేది ?

ఉ॥ చక్కగా చదివినను యభ్యాసము లేకుండుట.

ప్ర॥ జాగ్రతగల వాడెవడు ?

ఉ॥ వివేకము గలవాడు.

ప్ర॥ గాఢ నిద్రయేది ?

ఉ॥ జీవులయొక్క మూఢత్వము.

శ్లో॥ నలినీదల గతజల వత్తరలంకిం ♦ యావ్వనం ధనంచాయుః ।
కథయపునః కేశశినః ♦ కిరణసమాః సజ్జనాఏవ ॥ ౧౧.

ప్ర॥ తామరాకుపై నీటివలె నిలకడలేనివి యేవి ?

ఉ॥ యవ్వనము,ధనము, నాయువుయనునవి.

ప్ర॥ చంద్రకిరణమువలె నితరులకు హితము జేయువారెవరు ?

ఉ॥ ఉత్తములే.

శ్లో॥ కోనరకః పరవశతా ♦ కింసౌఖ్యం సర్వసంగవిరతిర్యా ।
కింసాధ్యం భూతహితం ♦ ప్రియంచకిం ప్రాణి నామసవః॥ ౧౨.

ప్ర॥ నరకముయేది.

ఉ॥ పరులకు వశమైయుండుట.

ప్ర॥ సౌఖ్యమేది ?

ఉ॥ సర్వసంగ పరిత్యాగము.

ప్ర॥ సాధించ తగినదియేది ?

ఉ॥ జీవులకు హితము గూర్చుట.

ప్ర॥ ప్రాణులకు ప్రియమైనదేది ?

ఉ॥ ప్రాణము.

శ్లో॥ కోఽనర్థ ఫలోమానః ♦ కాసుఖదా సాధుజనమైత్రీ।
సర్వవ్యసన వినాశేకో ♦ దక్షః సర్వధాత్యాగీ ॥ ౧౩.

ప్ర॥ ఏది యనర్థము నిచ్చును ?

ఉ॥ అహంభావము.

ప్ర॥ యేదిసుఖము నిచ్చును ?

ఉ॥ సత్సంగము అనగామంచిమనసుగల వారియొక్క స్నేహము.

ప్ర॥ దుఃఖమును దొలిగించుటయందు యెవడుసమర్థుడు ?

ఉ॥ ఒక్కటిన్నికోరక విడనాడినవాడు.

శ్లో॥ కింమరణం మూర్ఖత్వం ♦ కించానర్ఘం యదవసరేదత్తం।
అమరణాత్కింశల్యం ♦ ప్రచ్ఛన్నం యత్కృతంపాపం ॥ ౧౪.

ప్ర॥ మరణముకంటె మించినదేది ?

ఉ॥ మూఢత్వము.

ప్ర॥ విలువ లేనిదియేది ?

ఉ॥ సమయమందు యిచ్చినది,

ప్ర॥ చావుపర్యన్తము పొడుచునదియేది ?

ఉ॥ రహస్యముగా జేసినపాపము.

శ్లో॥ కుత్రవిధేయో యత్నో • విద్యాభ్యాసే సదౌషధేదానే।
అవధీరణాక్వకార్యాఖ లపరయో • షిత్పరధనేషు ॥ ౧౫.

ప్ర॥ ఎందునుగురించి ప్రయత్నము జేయవలెను ?

ఉ॥ విద్యాభ్యాసము, దానముజేయుట, దేహారోగ్యమువీటికిగాను.

ప్ర॥ అలక్ష్యము చేయవలసినది యేది ?

ఉ॥ దుర్మార్గులు, పరులభార్య, పరులసొత్తు యనునవి.

శ్లో॥ కాహర్నిశమను చిన్త్యాసంసారా • సారతాన తుప్రమదా।
కాప్రేయసీవిధేయా కరుణా • దీనేషుసజ్జనే మైత్రీ ॥ ౧౬.

ప్ర॥ రేయింబవలు తలంచవలసిన దేది ?

ఉ॥ సంసారములో సారములేదనునది.

ప్ర॥ ప్రేమించ వలసినదేది ?

ఉ॥ దీనులయెడ కరుణ, సాధులయెడ స్నేహము.

శ్లో॥ కణ్ఠగతై రప్యసుభిః • కస్యహ్యాత్మానశక్యతే జేతుమ్ ।
మూర్ఖస్య శఙ్కితస్యచ • విషాదినో వాకృతఘ్నస్య ॥ ౧౭.

ప్ర॥ ఎవనియొక్క యాత్మను మంచిమార్గమునకు తెచ్చుటకు సాధ్యముకాదు ?

ఉ॥ పోకిరివాండ్లు, నిత్యసందేహి, యేడ్పుముఖమువాడు, విశ్వాసములేనివాడు.

శ్లో॥ కఃసాధుః సద్వృత్తః ♦ కమధమమాచక్షతే త్వసద్వృత్తమ్।
కేనజితం జగదే తత్సత్యతి ♦ తితిక్షావతా పుంసా ॥ ౧౮.

ప్ర॥ సాధు యెవరు ?

ఉ॥ మంచినడతగల వాడు.

ప్ర॥ యెవడధముడు ?

ఉ॥ చెడ్డ నడతగలవాడు.

ప్ర॥ జగము నెవరు జయించగలరు ?

ఉ॥ సత్యమున్ను, వోర్పున్ను నుండినయెడల యీజగత్తును జయించగలరు.

శ్లో॥ కస్మైనమాం సిదేవాః ♦ కుర్వంతిదయా ప్రధానాయ।
కస్మాదుద్వేగః స్యా ♦ త్సంసారారణ్యతః సుధియః ౧౯. ॥

ప్ర॥ ఎవనిని దేవతులున్ను వందనము జేయుచున్నారు ?

ఉ॥ దయగలిగిన వానిని.

ప్ర॥ దేనినిజూచి భీతిజెందవలెను.

ఉ॥ సంసారమను నరణ్యముజూచి భయపడవలెను.

శ్లో॥ కస్యవశే ప్రాణిగణః ♦ సత్యప్రియ భాషిణోవినీతస్య।
క్వస్థాతవ్యం న్యాయ్యేపథి ♦ దృష్టా దృష్టలాభాఢ్యే ॥ ౨౦.

ప్ర॥ జీవరాసులెవనికి వశమగుదురు ?

ఉ॥ సత్యము, ప్రియమైన వచనము గలిగిన నమ్మనకు....

ప్ర॥ చూడబడినవియు, చూడబడనివియు యగువస్తువులను పొందుటకు నిలువవలసినది యెచట ?

ఉ॥ న్యాయమార్గమందు.

శ్లో॥ కోఽన్ధో యోఽకార్యరతః కోబధిరో యో హితాని నశృణోతి। కోమూకోయఃకాలే ప్రియాణివక్తుం నజానాతి॥ ౨౧.

ప్ర॥ గుడ్డివాడెవడు ?

ఉ॥ చదివియుండిన్నీ చెడుకార్యములు జేయువాడు.

ప్ర॥ చెవిటి వాడెవడు ?

ఉ॥ హితమును విననివాడు.

ప్ర॥ మూగవాడెవడు ?

ఉ॥ ఉచితమైనవార్తలను సరియగుకాలమందు జెప్పశక్తి లేనివాడు.

శ్లో॥ కిందాన మనాకాంక్షం కిం మిత్రం యోనివారయతిపాపాత్ । కోఽలంకారః శీలం కిం వాచాం మణ్డనంసత్యమ్ ॥ ౨౨.

ప్ర॥ దానమనునదియేది ?

ఉ॥ యాచించుటకు పూర్వమేయిచ్చుట.

ప్ర॥ స్నేహితుడెవరు ?

ఉ॥ పాపము జేయకుండ నడ్డుపరచువాడు.

ప్ర॥ అలంకారమేది ?

ఉ॥ శీలము.

ప్ర॥ వాక్కునకు యలంకారమేది ?

ఉ॥ సత్యము.

శ్లో॥ విద్యుద్విలసితచపలం కిం దుర్జనసంగతి ర్యువతయశ్చ ।
కులశీల నిష్ప్రకమ్పాః కే కలికాలేపి సజ్జనాఏవ ॥ ౨౩.

ప్ర॥ మెరుపుతీగకాన్తివలె చంచలమైనవి యేవి ?

ఉ॥ దుర్జన సంగమును, స్త్రీలున్ను.

ప్ర॥ కలికాలమందును కులశీలములనుంచి చలించని వారెవరు ?

ఉ॥ సత్పురుషులు.

శ్లో॥ చిన్తామణిరివ దుర్లభమిహ కిం కథయామి తచ్చతుర్భద్రం।
కింతద్వదంతి భూయోవిధూత తమసో విశేషేణ ॥ ౨౪.

శ్లో॥ దానం ప్రియవాక్సహితం జ్ఞానమగర్వం క్షమాన్వితం శౌర్యమ్ । విత్తం త్యాగసమేతం దుర్లభమేతచ్చతుర్భద్రమ్ ॥ ౨౫.

ప్ర॥ చింతామణివలె దుర్లభమైనదేది ? ( పొంద శక్యముగానిది.)

ఉ॥ నాలుగు భద్రములు. ( భద్రముగానుండునది భద్రము, శుభము. )

నాలుగు భద్రములనగా :—( ౧ ) ప్రియవాక్కుతో దానము, ( ౨ ) గర్వములేని జ్ఞానము, ( ౩ ) క్షమతోకూడిన శౌర్యము, ( ౪ ) త్యాగముతోగూడిన ధనము.

శ్లో॥ కింశోచ్యం కార్పణ్యం సతివిభవే కిం ప్రశస్తమౌదార్యమ్ ।
కఃపూజ్యః విద్వద్భిః స్వభావతః సర్వదావినీతోయః ॥ ౨౮.

ప్ర॥ పరితాపము పడతగినదేది ?

ఉ॥ కార్పణ్యము. ( లోభత్వము; తనకులేకుండగను, నితరులకు లేకుండగను, నిహమునకు లేకుండ, పరమునకు లేకుండ నిండుగానిలవజేసుకొని యుండుట. )

ప్ర॥ సౌకర్యములుండినపుడు యేదిప్రశస్తమైనది, పొగడబడునది?

ఉ॥ ఔదార్యము.

ప్ర॥ బుద్ధిగలవారెవరిని పూజింతురు ?

ఉ॥ స్వభావముగనే నెల్లప్పుడు నమ్రితగలవానిని. ( కార్యము నుద్దేశించి వినయము గలిగియుండుట స్వాభావిక వినయము గాదు. ) కార్యమునుద్దేశించి వినయముగా నుండువాడు, యేతముకర్రకు సమానుడని యొక శ్లోకమున్నది. బొక్కెన నిండిన తోడనే యేతముకర్ర యొక్క పైకొన యాకాశమందుండును. బొక్కెన వట్టిపోయిన తదుపరి పైకొనవంగి పోవును.

అవ్విధముగనే కార్యము నుద్దేశించి వినయముగానుండు వాడుజీవనము లేనపుడు తలనువంచును. జీవనము దొరికినయెడ తలనిక్కబడును.

శ్లో॥ కః కుల కమలదినేశః సతిగుణ విభవేఽపి యోనమ్రః ।
కస్యవశే జగదేతత్ప్రియహిత వచనస్యధర్మ నిరతస్య ॥ ౨౭.

ప్ర॥ మనము పుట్టియున్న కులమను తామరపువ్వు యే సూర్యుని చూచినయెడల యానందముతో ప్రకాశించును ?

ఉ॥ గుణములు పరిపూర్ణముగ యున్నను, పరిపూర్ణమైన వినయముతో యున్నవానిని జూచినయెడల కులమను తామర ప్రకాశించును.

ప్ర॥ ఈప్రపంచమెవరికి వశమగును ?

ఉ॥ ప్రీతిగామాట్లాడుట నేర్చుకొని ధర్మమునను ష్ఠించు వానికి ప్రపంచము వశమైపోవును.

( ప్రపంచమును వశ్యము జేసుకొనుటకు వినయము నవలంబించకూడదు. వినయముతోనుండిన యెడల, జగత్తుతానే వశబడి పోవును. )

శ్లో॥ విద్వన్మనోహరా కా సత్కవితా బోధవనితాచ ।
కంనస్పృశతివిపత్తిః ప్రవృద్ధవచనానువర్తినందాంతమ్॥ ౨౮.

ప్ర॥ విద్వాంసుల మనస్సునాకర్షించునది యేది ?

ఉ॥ మంచికవిత్వమును బుద్ధిగలస్త్రీయును.

ప్ర॥ విపత్తు యెవనినంటదు ?

ఉ॥ పెద్దలవాక్యము ననుసరించి నడచువానినీ, నడకువగలవానిని.

శ్లో॥ కస్మైస్పృహయతి కమలా త్వనలస చిత్తాయ నీతివృత్తాయ।
త్యజతిచకం సహసాద్విజగురు సురనిన్దాకరం చసాలస్యమ్॥ ౨౯.

ప్ర॥ లక్ష్మి యెవరిని యిష్టపడును ?

ఉ॥ శుద్ధచిత్తముగలిగి నీతితప్పని నడతగలవానిని.

ప్ర॥ ఎట్టివానిని శీఘ్రముగావిడచి వేరగును ?

ఉ॥ బ్రాహ్మణుని, గురువును, దేవతలను నిందించుసోమరిని.

శ్లో॥ కుత్రవిధేయో వాసః సజ్జననికటేఽథవా కాశ్యామ్।
కఃపరిహార్యో దేశః పిశునయుతో లుబ్ధభూపశ్చ॥ 30.

ప్ర॥ వాసము చేయవలసినది యెచ్చట ?

ఉ॥ మంచివారియొక్క సమీపమందు లేక కాశీక్షేత్రమందు.

ప్ర॥ విడిచిపోవలసిన దేశమేది ?

ఉ॥ అల్పులగుప్రజలు, లోభియగురాజును, గలిగినదేశము.

శ్లో॥ కేనాశోచ్యః పురుషః ప్రణతకలత్రేణ ధీరవిభవేన।
ఇహభువనే కః శోచ్యః సత్యపివిభవేనయో దాతా॥ 3౧.

ప్ర॥ దేనిచేతమనుజుడు దుఃఖములేనివాడగును ?

ఉ॥ వినయముగల భార్యచేతను, స్థిరమగు నైశ్వర్యము చేతను.

ప్ర॥ ఈప్రపంచములో వ్యసనబడదగినవాడెవడు ?

ఉ॥ ధనమున్నప్పటికిన్నీ యివ్వనివాడు.

శ్లో॥ కింలఘుతాయామూలం ప్రాకృతపురుషేషు యాయాఞ్చా।
రామాదపికః శూరః స్మరశరనిహతోన యశ్చలతి॥ 3౨.

ప్ర॥ నీచత్వమునకు గారణమేది ?

ఉ॥ నీచులను యాచించుట.

ప్ర॥ శ్రీరామునికన్నను శూరుడెవడు ?

ఉ॥ మన్మథ బాణములతో కొట్టబడినను స్వస్థితిలోనుండువాడు.

శ్లో॥ కిమహర్నిశమనుచిన్త్యం భగవచ్చరణం నసంసారః ।
చక్షుష్మన్తోఽప్యన్ధాః కేస్యుర్యేనాస్తి కామనుజాః ॥ 33.

ప్ర॥ అహోరాత్రము చింతించదగినది యేది ?

ఉ॥ ఈశ్వరుని పాదారవిందములే. సంసారముకాదు.

ప్ర॥ నేత్రములున్నను గుడ్డివాడెవరు ?

ఉ॥ నాస్తికులయిన మనుజులు.

శ్లో॥ కఃపఙ్గురిహప్రథితో వ్రజతిచయో వార్ధకేతీర్థమ్ ।
కింతీర్థమపిచముఖ్యం చిత్తమలం యన్నివర్తయతి ॥ 3౪.

ప్ర॥ వికలాంగుడెవడు ?

ఉ॥ ముదిరిన వయస్సులో తీర్థయాత్రపోవుచున్నవాడు.

ప్ర॥ ముఖ్యమగు తీర్థమేది ?

ఉ॥ చిత్తమునందుండు మలమును నేదిపోగొట్టునో యదియే.

శ్లో॥ కింస్మర్తవ్యం పురుషైర్హరినామసదాన యావనీభాషా ।
కోహినవాచ్యః సుధియాపర దోషశ్చానృతం తద్వత్ ॥ 3౫.

ప్ర॥ మనుష్యులచే స్మరింపబడదగినది యేది ?

ఉ॥ ఎల్లప్పుడును హరినామమే మ్లేచ్ఛభాషగాదు.

ప్ర|| మంచిబుద్ధిగలవానిచేత జెప్పబడతగనిదియేది ?

ఉ|| ఇతరుల దోషము, అసత్యము.

శ్లో|| కింసంపాద్యం మనుజై ర్విద్యా విత్తంబలం యశః పుణ్యమ్ ।
కః సర్వగుణ వినాశీలోభః శత్రుశ్చకః కామః || ౩౬.

ప్ర|| మనుజులచే సంపాదింపబడదగినదియేది ?

ఉ|| విద్య, ధనము, బలము, యశస్సు పుణ్యమనునివి.

ప్ర|| సకలగుణములను నాశనముజేయునదేది ?

ఉ|| లోభము కృపణత్వము.

ప్ర|| విరోధి యెవడు ?

ఉ|| కామము.

శ్లో|| కాచసభాపరిహార్యాహీనా యావృద్ధసచివేన ।
ఇహకుతావహితః స్యాన్మనుజః కిలరాజసేవాయామ్ || ౩౭.

ప్ర|| ఏసభను విసర్జించవలెను ?

ఉ|| వయసుముదిరిన మంత్రులులేనిసభను.

ప్ర|| ఈప్రపంచమందు మనుజులు యేవిషయములో జాగ్రతతో
నుండవలెను ?

ఉ|| రాజసేవ చేయుటయందు.

శ్లో|| ప్రాణాదపికోరమ్యాః కులధర్మః సాధుసజ్జనశ్చ ।
కాసంరక్ష్యా కీర్తిః పతివ్రతా నైజబుద్ధిశ్చ || ౩౮.

ప్ర॥ ప్రాణముకంటెను ప్రియమైనదేది ?

ఉ॥ కులధర్మము సాధులయొక్క చేరికయున్నూ.

ప్ర॥ రక్షింపబడదగినది యేది ?

ఉ॥ కీర్తియు, పాతివ్రత్యము, స్వబుద్ధియును.

శ్లో॥ కాకల్పలతాలోకే సచ్ఛిష్యాయార్పితావిద్యా ।
కోఽక్షయవటవృక్షః స్యాద్విధి వత్సత్పాత్ర దత్తదానం యత్ ॥ ౩౯.

ప్ర॥ లోకములో కల్పలతవంటిదేది ?

ఉ॥ సచ్ఛిష్యులకు నర్పణముజేయబడువిద్య ( చదివిన ప్రతివాడున్ను పూర్వదినములలో తానుపఠించినవిద్యను శిష్యులకు బోధించవలసియుండెను. ఈదినములలో యల్. టీ., లుమాత్రమే యది చేయుచున్నారు. ఇతరులు తాము పఠించిన విద్యను కాలక్షేపమున కుపయోగించు చున్నారు.

ప్ర॥ అక్షయవటవృక్షము పోలినదేది ?

ఉ॥ విధిప్రకారము సత్పాత్రమునకై నివ్వబడుదానము.

శ్లో॥ కింశస్త్రం సర్వేషాం యుక్తిర్మాతాచకా ధేనుః ।
కిన్నుబలం యద్ధైర్యం కోమృత్యుర్యదవధానరహితత్వమ్॥౪౦.

ప్ర॥ ఏయాయుధమందరికి హస్తమందున్నది ?

ఉ॥ యుక్తి. (న్యాయపూర్వముగా, నిరూపణము జేయగలశక్తి.)

ప్ర॥ ఎల్లరకు తల్లియెవరు ?

ఉ॥ ఆవు. ( తనబిడ్డకు పాలిచ్చి, యూరికెల్లను పాలిచ్చుచున్నది, ఆవు. దానినేమనము రక్షించవలెను. )

ప్ర॥ ఏది సైన్యము ?

ఉ॥ ధైర్యము.

ప్ర॥ ఏది మృత్యువు ?

ఉ॥ ఏకాగ్రత లేకపోవుట.

శ్లో॥ కుత్రవిషందుష్టజనే కిమిహాశౌచం భవేదృణం నృణామ్ ।
కిమభయ మిహవైరాగ్యం భయమపి కిం విత్తమేవసర్వే
షాం ॥ ౨౧.

ప్ర॥ విషమెచ్చట నున్నది ?

ఉ॥ దుష్టజనులయందున్నది.

ప్ర॥ మొదటితరగతి యశుచియేది ?

ఉ॥ ఋణమే. ( ఉప్పిచ్చినవానికి మనుజులుకనబడక దాగినట్లు మరొకదేనికిన్ని దాగుటలేదు. అశుచిస్థితిలో దేవాలయమునకు పోకూడదు, సభకుపోకూడదు, ఋణస్తుడున్ను నటులనే పోనేరడు. )

ప్ర॥ అభయమేది ? ( భయము జెందనిస్థితి. )

ఉ॥ వైరాగ్యము. ( ఆశనువిడిచినయెడల నదియేయభయము. )

ప్ర॥ ఏదిభయము ?

ఉ॥ ధనమే.

శ్లో॥ కాదుర్లభానరాణాం హరిభక్తిః పాతకంచ కిం హింసా ।
కోహిభగవత్ప్రియః స్యాదో్యఽన్యం నోద్వేజయే దను
ద్విగ్నః ॥ ౪౨.

ప్ర॥ నరులకు దుర్లభమైనదేది ?

ఉ॥ హరిభక్తి.

ప్ర॥ ఏదిపాతకము ?

ఉ॥ హింసించుట.

ప్ర॥ భగవంతునకు నెవరియెడ పరమప్రియము ?

ఉ॥ తానున్ను మనస్సునందు యుపద్రవము చెందక, యితరుల
కున్ను యుపద్రవము కలిగించ తలంచని వానియెడల.

శ్లో॥ కస్మాత్సిద్ధి స్తపసోబుద్ధిః క్వను భూసురే కుతోబుద్ధిః ।
వృద్ధోపసేవయాకే వృద్ధాయే ధర్మతత్త్వజ్ఞాః ॥ ౪౩.

ప్ర॥ దేనిచేత కార్యసిద్ధి కలుగుచున్నది ?

ఉ॥ తపస్సువల్ల. ( ఏకాగ్రచిత్తుడై నొకకార్యమందు తలంపు
నుంచుట. )

ప్ర॥ తపస్సుదేనివలన కలుగుచున్నది ?

ఉ॥ బుద్ధివలన.

ప్ర॥ బుద్ధి యెచ్చటున్నది ?

ఉ॥ బ్రాహ్మణుని యందు.

ప్ర॥ నిజమైన బుద్ధియేది ?

ఉ॥ పెద్దలనాశ్రయించి శుశ్రూషచేసి పొందుబుద్ధి.

ప్ర॥ పెద్దలెవరు ?

ఉ॥ ధర్మతత్త్వములను తెలిసినవారు. ( వారు వయస్సునందు చిన్నవారైనను పెద్దలే. )

శ్లో॥ సంభావితస్యమరణా దధికం కిం దుర్యశోభవతి ।
లోకేసుఖీభవేత్కో ధనవాన్ధనమపిచ కిం యతశ్చేష్టమ్॥ ౪౪.

ప్ర॥ కీర్తివంతునకు మరణముకంటెను యేదిపెద్దది ?

ఉ॥ అపకీర్తి.

ప్ర॥ ఎవడుసుఖి ?

ఉ॥ ధనవంతుడు.

ప్ర॥ ధనమనునది యేది ?

ఉ॥ దేనిచేయిష్టసిద్ధికలుగునో నదియేధనము.

శ్లో॥ సర్వసుఖానాం బీజం కిం పుణ్యం దుఃఖమపికుతః పాపాత్ ।
కస్యైశ్వర్యం యః కిలశంకరమారాధయేద్భక్త్యా ॥ ౪౫.

ప్ర॥ అన్నిసుఖములకు మూలమేది ?

ఉ॥ పుణ్యము.

ప్ర॥ దుఃఖములకు మూలమేది ?

ఉ॥ పాపము.

ప్ర॥ ఐశ్వర్యమెవరికి కలుగును ?

ఉ॥ ఈశ్వరునిభక్తితో నారాధించువానికి.

శ్లో॥ కోవర్ధతే వినీతః కోవాహీయేత యో దృప్తః ।
కోనప్రత్యేతవ్యో బ్రూతేయశ్చానృతం శశ్వత్ ॥ ౮౬.

ప్ర॥ ఎవడు వృద్ధిలోకిరాగలడు ?

ఉ॥ వినయముగలవాడు.

ప్ర॥ ఎవడు నష్టము పొందును ?

ఉ॥ గర్వముగలవాడు.

ప్ర॥ ఎవనిని నమ్మకూడదు.

ఉ॥ ఎల్లప్పుడు యబద్ధము పలుకువానిని.

శ్లో॥ కుత్రానృతేఽప్యపాపం యచ్చోక్తం ధర్మరక్షార్థమ్ ।
కోధర్మోఽభిమతోయః శిష్టానాం నిజకులీనానామ్ ॥ ౮౭.

ప్ర॥ అబద్ధమువాట్లాడుట యేసమయమందు పాపముగానేరదు ?

ఉ॥ ధర్మమును రక్షించుటకు చెప్పబడ్డయబద్ధము పాపముగాదు.

ప్ర॥ ఏదిధర్మము.

ఉ॥ మనవంశములో పుట్టిన పెద్దలలో స్నానానుష్ఠానముగల వారు యనుష్ఠించినధర్మమే మనకుధర్మము.

శ్లో॥ సాధుబలం కిం దైవం కస్సాధుః సర్వదాతుష్టః।
దైవంకిం యత్సుకృతం కస్సుకృతీశ్లాఘ్యతేచయః సద్భిః॥ ౪౮.

ప్ర॥ సాధువునకు బలమెవరు ?

ఉ॥ దైవము.

ప్ర॥ సాధువు యెవరు ?

ఉ॥ ఎల్లప్పుడును సంతుష్టితోనుండువాడు. దుఃఖిగాడు.

ప్ర॥ దైవమేది ?

ఉ॥ నీవుచేసిన మంచికార్యమే.

ప్ర॥ సుకృతము జేసినవాడెవరు ?

ఉ॥ మంచివారివల్ల శ్లాఘింపబడువాడు.

శ్లో॥ గృహమేధినశ్చమిత్రం కిం భార్యా కో గృహీచ యోయజతే।
కో యజ్ఞోయః శ్రుత్యావిహితశ్శ్రేయస్కరో నృణాం॥ ౪౯.

ప్ర॥ గృహస్థాశ్రమమందు మిత్రుడెవడు ?

ఉ॥ భార్య.

ప్ర॥ గృహస్థుడెవడు ?

ఉ॥ యజ్ఞములను జేయువాడు.

ప్ర॥ యజ్ఞమనునది యేది ?

ఉ॥ చేయబడవలసినదని, వేదమువల్ల నేది విధింపబడి, మనకు శ్రేయస్సు యిచ్చుచున్నదో, నదియే.

శ్లో॥ కస్య క్రియాహిసఫలా యః పునరాచారవాఙ్శిష్టః ।
కఃశిష్టో యోవేదప్రమాణవా న్కోహతః క్రియాభ్రష్టః॥౨౦.

ప్ర॥ కర్మానుష్ఠానము లెవనికి ఫలించును ?

ఉ॥ ఆచారముగలవాడు గాను, శిష్టుడుగానువుంటూ వేదమందు పరమనమ్మకము గలవానికి ఫలించును ?

ప్ర॥ ఎవడు జీవించియుండియు మరణించినవాడు ?

ఉ॥ కర్మములను జేయనివాడు.

శ్లో॥ కో ధన్యః సన్యాసీ కో మాన్యః పండితః సాధుః ।
కఃసేవ్యో యోదాతా కోదాతా యోర్థితృప్తిమాతనుతే॥౨౧.

ప్ర॥ ఎవడు ధన్యుడు ?

ఉ॥ సన్యాసి.

ప్ర॥ ఎవడు పూజింపబడువాడు ?

ఉ॥ పండితుడు. ( చదివి, సాధువుగానుండువాడు. )

ప్ర॥ ఎవరిని సేవించవలెను ?

ఉ॥ దాతను.

ప్ర॥ దాతయెవరు ?

ఉ॥ యాచకునకు తృప్తి గలుగజేయువాడు.

శ్లో॥ కిం భాగ్యం దేహవతా మ్మారోగ్యం కః ఫలీ కృషికృత్ ।
కస్యనపాపం జపతః కః పూర్ణోయః ప్రజావాన్స్యాత్ ॥ ౨౨.

ప్ర॥ గొప్ప భాగ్యమేది ?

ఉ॥ ఆరోగ్యము.

ప్ర॥ ఫలము యెవనికి దొరుకును ?

ఉ॥ ప్రియత్నించువానికి.

ప్ర॥ పాపము యెవరికిరాదు ?

ఉ॥ ఎల్లప్పుడు జపించువానికి.

ప్ర॥ పూర్ణుడెవడు ?

ఉ॥ సత్సంతానము గలవాడు.

శ్లో॥ కిం దుష్కరం నరాణాం యన్మనసోనిగ్రహః సతతమ్ ।
కో బ్రహ్మచర్యవా న్స్యాద్యశ్చాస్ఖలితోర్ధ్వరేతస్కః॥ ౫౩.

ప్ర॥ చేయుటకు కష్టమైనదేది ?

ఉ॥ మనస్సును నిరోధించి బంధించుటయే.

ప్ర॥ ఎవడు సరియగు బ్రిహ్మచారి.

ఉ॥ ఊర్ధ్వరేతస్సుగలవాడు.

శ్లో॥ కాచ పరదేవతోక్తా చిచ్ఛక్తిః కోజగద్భర్తా ।
సూర్యః సర్వేషాం కో జీవనహేతుః సపర్జన్యః ॥ ౫౪.

ప్ర॥ పరదేవత యెవరు ?

ఉ॥ జ్ఞానరూపమైన నంబిక.

ప్ర॥ జగమునకు భర్తయెవరు ?

ఉ॥ సూర్యుడు. ( అన్నమునిచ్చువాడు. )

ప్ర|| జీవనమునకు కారణమేది ?

ఉ|| వర్షము.

శ్లో|| కశ్శూరో యోభీతత్రాతా త్రాతాచ కః సగురుః।
కోహి జగద్గురురుక్తః శంభుర్జ్ఞానం కుతః శివాదేవ || ౫౫.

ప్ర|| శూరుడెవడు ?

ఉ|| భయము జెందినవానిని రక్షించువాడు.

ప్ర|| రక్షించువాడెవడు ?

ఉ|| సద్గురువు.

ప్ర|| జగద్గురువు యెవరు ?

ఉ|| శంభువు.

ప్ర|| జ్ఞానము నెచ్చటనుండి గలుగును ?

ఉ|| వారివద్దనుండియే.

శ్లో|| ముక్తిం లభేతకస్మా న్ముకుందభక్తే ర్ముకుందః కః।
యస్తారయేదవిద్యాం కాచావిద్యా యదాత్మనోఽ
స్ఫూర్తిః || ౫౬.

ప్ర|| మోక్షము దేనివలన గలుగును ?

ఉ|| ముకుందుని భక్తివలన.

ప్ర|| ముకుందుడెవరు ?

ఉ|| అవిద్యను దాటింపజేయువాడు.

ప్ర॥ అవిద్య యేది ?

ఉ॥ ఆత్మను మఱుగుపఱచునది.

శ్లో॥ కస్యనశోకో యః స్యాదక్రోధః కిం సుఖం తుష్టిః ।
కో రాజా రంజనకృత్ కశ్చశ్వా నీచసేవకో యః స్యాత్ ॥ ౫౭.

ప్ర॥ ఎవరికి దుఃఖములేదు ?

ఉ॥ కోపములేనివానికి.

ప్ర॥ సుఖమేది ?

ఉ॥ ఆంతరంగిక ఆనందము. ( పళ్లు యిగిలించుటకాదు. )

ప్ర॥ రాజెవరు ?

ఉ॥ వీనికి పోలినవాడులేడని జెప్పబడువాడు.

ప్ర॥ శునకమెవరు ?

ఉ॥ నీచస్వభావముగల వానివద్ద సేవజేయు దౌర్భాగ్యము గల వాడు.

శ్లో॥ కో మాయీ పరమేశః క ఇంద్రజాలాయ తే ప్రపంచోఽయమ్।
కః స్వప్ననిభో జాగ్రద్వ్యవహారః సత్యమపిచకిం బ్రహ్మ॥ ౫౮.

ప్ర॥ మాయను నిగ్రహించి పరిపాలించువాడెవరు ?

ఉ॥ పరమేశ్వరుడు.

ప్ర॥ ఇంద్రజాలమేది ?

ఉ॥ ప్రపంచమే.

ప్ర॥ స్వప్నమువంటిదేది ?

ఉ॥ జాగ్రిదవస్థలోనుండు వ్యవహారము.

ప్ర॥ సత్యమేది ?

ఉ॥ పరబ్రహ్మము.

శ్లో॥ కిం మిథ్యాయద్విద్యా నాస్యం తుచ్ఛంతు శశవిషాణాది ।
కాచానిర్వచనీయా మాయా కిం కల్పితం ద్వైతమ్ ॥ ౫౯

ప్ర॥ జ్ఞానమువలన నాశనమగునది యేది ?

ఉ॥ మిథ్య. ( అబద్ధము. )

ప్ర॥ ఏదితుచ్ఛము ?

ఉ॥ కుందేటికొమ్ము మొదలగునవి.

ప్ర॥ నిజమని యబద్ధమని జెప్పుటకు వీలుకానిదియేది ?

ఉ॥ మాయ.

ప్ర॥ దానివలన గలిగింపబడునది యేది ?

ఉ॥ ద్వైతము.

శ్లో॥ కిం పారమార్థికం స్యాదద్వైతం చాజ్ఞతా కుతోఽనాది ః।
వపుషశ్చపోషకం కిం ప్రారబ్ధం చాన్నదాయి కిం చాయుః॥౬౦,

ప్ర॥ ఏది పారమార్థికము ?

ఉ॥ అద్వైతము.

ప్ర॥ అజ్ఞానము దేనివలన గలుగుచున్నది ?

ఉ॥ దానికి ఆదిలేదు.

ప్ర॥ దేహానికి పోషణమిచ్చునదేది ?

ఉ॥ ప్రారబ్ధము.

ప్ర॥ అన్నము నిచ్చునదేది ?

ఉ॥ ఆయుస్సు.

శ్లో॥ కో బ్రాహ్మణైరుపాస్యో గాయత్ర్యర్కాగ్ని గోచరశ్శంభుః।
గాయత్ర్యామాదిత్యే చాగ్నౌ శంభౌచ కిం నుతత్త్వమ్॥౬౧.

ప్ర॥ బ్రాహ్మణులెవరిని యుపాసించవలెను ?

ఉ॥ గాయత్రి, సూర్యమండలము, అగ్ని, వీటిలో గోచరమగు చుండు శంభుని.

శ్లో॥ ప్రత్యక్షదేవతా కామాతా పూజ్యోగురుశ్చ కస్తాతః।
కస్సర్వదేవతాత్మా విద్యాకర్మాన్వితో విప్రః॥౬౨.

ప్ర॥ ప్రత్యక్షదేవత యెవరు ?

ఉ॥ తల్లి.

ప్ర॥ పూజింపవలసిన గురువెవరు ?

ఉ॥ తండ్రి.

ప్ర॥ సకల దేవతాస్వరూపి యెవరు ?

ఉ॥ జ్ఞానకర్మసిద్ధిగల బ్రాహ్మణుడు.

శ్లో॥ కశ్చకులక్షయ హేతుః సంతాపః సజ్జనేషు యోఽకారి।
కేషామమోఘవచనం యేచపునః సత్యమానశమశీలాః॥ ౬౩.

ప్ర॥ కులనాశమునకు కారణమేది ?

ఉ॥ సాధుజనులహృదయమందు తాపముగలుగజేయు కార్యము.

ప్ర॥ ఎవరియొక్క వాక్కు ఫలించును ?

ఉ॥ సత్యవ్రతము, మౌనవ్రతము, క్షమ యివియన్ని గలిగిన వారివాక్కు.

శ్లో॥ కిం జన్మవిషయసఙ్గః కిముత్తరం జన్మ పుత్రః స్యాత్ ।
కోఽపరిహార్యోమృత్యుః కుత్రపదం విన్యసేచ్చదృక్పూతే॥౬౪

ప్ర॥ జన్మమునకు కారణమేది ?

ఉ॥ విషయమందు పట్టు.

ప్ర॥ ఉత్తర జన్మయేది ?

ఉ॥ పుత్రుడు.

ప్ర॥ పరిహరించుటకు వీలులేనిదేది ?

ఉ॥ యముడు.

ప్ర॥ పాదము యెచ్చట పెట్టవలెను ?

ఉ॥ చూపుచే పరిశుద్ధముచేయబడిన చోటుయందు. (ప్రాణులకు హింసకలుగునట్లు పాదము పెట్టకూడదు. )

శ్లో॥ పాత్రం కిమన్నదానే క్షుధితం కోఽర్చ్యోహి భగవదవతారః।
కశ్చభగవాన్ మహేశః శంకర నారాయణాత్మకైః॥ ౬౫.

ప్ర॥ అన్నదానమునకు పాత్రుడెవడు ?

ఉ॥ ఆకలిగలవాడు.

ప్ర॥ ఎవరిని యర్చించవలెను ?

ఉ॥ భగవంతుని యవతారమును.

ప్ర॥ భగవంతుడెవరు ?

ఉ॥ శంకరుడు, నారాయణుడుయగు నొక్కటేమూర్తి.

శ్లో॥ ఫలమపి భగవద్భక్తేః కిం తల్లోక స్వరూపసాక్షాత్త్వమ్ ।
మోక్షశ్చకో హ్యవిద్యాస్తమయః కఃసర్వవేదభూ రథ
చోమ్ ॥ ౬౬.

ప్ర॥ భగవద్భక్తికి ఫలమేది ?

ఉ॥ వానియొక్క లోకసాక్షాత్కారము.

ప్ర॥ మోక్షమేది ?

ఉ॥ అవిద్యను నిర్మూలించుట.

ప్ర॥ సకలవేదములకు యుత్పత్తియున్ను, లయమున్ను, యేది ?

ఉ॥ ఓమ్.

శ్లో॥ ఇత్యేషాకణ్ఠస్థా ప్రశ్నోత్తరరత్నమాలికా యేషామ్ ।
తేముక్తాభరణా ఇవవిమలాశ్చా భాన్తిసత్సమాజేషు ॥ ౬౭.

ఈప్రశ్నోత్తర రత్నమాలను మనస్సున ధరించినవారు, ముక్తాభరణముబోలి సజ్జనులు నిండియుండు సభలలో, ప్రకాశించుదురు.

ప్రశ్నోత్తర రత్నమాలలో 67 శ్లోకములున్నవి. 65 మాత్రము మనయాచార్యులుజేసినట్లు నేనుతలంచుచున్నాను.

"ఓం" యని 66వ శ్లోకమందు జెప్పియుండుటచే వారు పూర్తిచేసిరి. ఆదిశ్లోకమున్నూ, అంత్యశ్లోకమున్నూ వేరుగా నెవరివల్లనో భక్తిచే చేర్పబడి యుండవలెను. మన యాచార్యులురచించిన గ్రంథములలోకెల్లను నిదియే లఘువైనది. సంస్కృతము నేర్చుకొనుపిల్లలకును నుపయోగబడ తగినదని శ్రీస్వాములవారు జెప్పిరి.

—( 0 )—

## ౧౨. నగరము, ఆస్తిక్యము.

నేను వూరువూరు సంచరించుచు వచ్చుటలో నొక్కొక కట్టడములో నివసింపజేయుచున్నారు. వూరియిండ్లలోను నివసించుటయు యుండును. కొన్నిస్థళములలో పొగవిశేషముగా నుండును. స్వామికి నైవేద్యము సమీపమందు పెట్టవలసియుండుటచే పూజ జేయునప్పుడు పొగ విశేషముగానుండును. దీనినుంచి తప్పించుకొనుటకు యనుభవములో నొకమార్గము కనిపెట్టితిని. పొయ్యిప్రక్కన పడుకొనినయెడల నచట పొగయుండదు. చోరులు విశేషముగానుండు గ్రామమందు నివసించినయెడల మనకు చోరుల భయముండదు. ఏది యుపద్రవమో దానిసమీపమునకు పోయిన యెడల యుపద్రవముండదు.

పట్టణము గొప్ప నరకవాసమని గ్రామములో నుండువారు జెప్పుటగలదు. పట్టణమందు వేదములేదు, స్నానములేదు, ఆచారములేదని యనెదరు. అయినను నాస్తిక్యము చవుకయని జెప్పబడు పట్టణములో, ప్రవేశించి చూచినయెడల యాస్తిక్యము చవుకగాయున్నది. గ్రామములలోనే ప్రస్తుతము స్నానసంధ్యావందనములులేవు. ఉదయము 8 ఘంటలకు స్నానఘట్టములలో కూర్చొని పండ్లుతోమి యెచ్చటనూ వుమ్మివేయుచున్నారు. చీట్లాడుట బలమైపోయినది. పొగాకు నుపయోగపర్చని గ్రామములేదు. వారికి కుటుంబకార్యములేదు, వైదీకములేదు. ఇచ్చట యెల్లరకు కార్యముండబట్టి సోమరితనములేదు. పట్టణములో బంధింపబడితిమియను తలంపుతో, స్నానము, సంధ్యచేయుటకు స్వల్పముగనైన నధ్యయనము జేయుటకున్ను యభిలాషగలదు. ఇచ్చట బాలురు యాచార్యుల స్తోత్రములనుజెప్పినది జక్కగా నుండెను. పూర్వకాలమందుదయము, 5 ఘంటలకులేచి "చంద్రశేఖరాష్టకము" "గోవిందాష్టకము" మొదలైనవి పఠించుదురని వినియున్నాను. "చంద్రశేఖరాష్టకము" బాలురు జెప్పగ నేడేవింటిని. బాలురు యానందముగా జెప్పునటుల మన యాచార్యులు స్తోత్రములను రచించిన శృంగారము తెలియవచ్చెను. వేదాధ్యయనమున్ను జక్కగానుండెను. పట్టణమందు వీటినెల్లను

ప్రత్యక్షముగాజూచినతదుపరి సంతోషముగాయున్నది. రేపుమాపు బస్సనుచు బస్సులు పరుగెత్తుచుండు తరుణమున యిట్లుండుట సంతోషము.

ఈదేవాలయ (చెన్నపట్టణమందలి పగడపువర్తకుల వీధి లోని శ్రీకాళహస్తీశ్వర దేవాలయ) ధర్మకర్తయైన శెట్టి గారు మిక్కిలి వృద్ధులు. పూర్ణభక్తిగలవారు. నావద్ద యనేకులు తమయొక్క కుటుంబకోఱతలను జెప్పుకొందురు. వారు యటుల జేయలేదు. శివరాత్రి యుత్సవమునకు సహాయము జేయమని మీకెల్లరకును జెప్పమనియే వేడుకొనిరి. ఇట్టివారివల్లనేయాస్తిక్య మింకను జీవించియున్నది. వారివల్లనేధర్మము, యింకను నడిపింప బడుచున్నది. ఇట్టివారు యిద్దరుగాని యొకరుగాని యుండినచో, ధర్మము యర్థప్రాణముతోయున్నను వృద్ధియైపోవును.

ఈజ్ఞానాంబికా దేవాలయము నిర్ధనదేవాలయము. బీదస్థితి గల స్థళముననే, కార్యములు జక్కగానడుచుచున్నవి యనుటకు నీదేవాలయ ముదాహరణము.

తంజావూరుజిల్లా జలమయమైనది. కాలువలవెంబడి వచ్చు జలమును పొలములకు పారుదలజేయుటకు, కాలితో జలమునడ్డగించినచోచాలును. సేలంమొదలగు జిల్లాలలో జలము జూచుట దుర్లభము. ఏతమువేసి పారుదలచేయవలెను. అటువంటిశ్రమలేని తంజావూరు జిల్లాలో ముఖ్యముగా పన్నులేని సర్వమాన్య

గ్రామములో సోమరితనము ప్రబలి దారిద్ర్యము పాదుకొని పోయెను. సెట్టినాడులో "ఊరణి" యని తటాకమునకు పేరు. మెట్లు కట్టియుందురు. చుట్టును దీపములు బెట్టియుందురు. అయితే తటాకములో నీరుండదు. మార్వాడీల దేశమగు మార్వాడులో నున్న జలము లేదు. ఈ రెండునాడులలో నైశ్వర్యము యథేచ్ఛగా యున్నది. నాడులు సారవంతమైనవి కానందుననే "సముద్రయానము జేసి ద్రవ్యమును సేకరించు" మనినటుల నాదేశపు ప్రజలు ప్రయాసగలవారుగా యుండుటే దానికి కారణము. జలమయము, భూసారముయుండు దేశములలో నైశ్వర్యము శూన్యము. అటులనే శిష్టాచారము చవకగాయుండి యున్న గ్రామములలో నిప్పుడేమియు లేదు. నాస్తికపట్టణమందు కర్మానుష్ఠానముగలదు. అయితే యిది చాలదు. ఈ పెద్దపట్టణములో కొందరధ్యయనము జేయుటజాలదు. పట్టణమందెల్లడలను జేయునట్లు జేయవలెను. ధర్మకర్త సెట్టిగారు మంచివారని తోచుచున్నది. వారికి తోడ్పడి దేవాలయపు కార్యములు జక్కగా నెరవేరునట్లు జేయవలెను. ఎల్లరును నధ్యయనము జేయవలెను. ఆచార్యుల స్తోత్రములను పఠించవలెను. దేవాలయములు జక్కగానడుచునట్లు జేయవలెను. అందరు క్షేమముగానుండవలెను.

—(0)—

# ౧౩. "మనమేల నమస్కరించుచున్నాము."

మనము మనుజులము; ఇతరానేకప్రాణులున్నవి. అవి యెల్లను యడ్డముగా పెరిగియున్నవి. మనుష్యులు మాత్రము పూర్ధ్వముగా పెరిగియున్నారు. మనుజుడు ఊర్ధ్వదృష్టి కలిగియుండ వలెననియే యీశ్వరుని యుద్దేశ్యము. మనుజునికి క్రింద కీటకము వఱకును వివిధసృష్టులుగలవు. ప్రాకెడు ప్రాణులు, యగిరెడు ప్రాణులు, నడచు ప్రాణులుయగు నెల్లను నడ్డముగనే పెరిగి యున్నవి. ఇవ్విధముగామనుజునికి క్రింద పలుజీవ వర్గములున్నట్లు, మనుజునికిపైనను యనేక జీవవర్గములున్నవని మనశాస్త్రములు జెప్పుచున్నవి. మనుజునికి క్రిందికి పోనుపోను జ్ఞానముకొఱతపడును. మనుజునికి పై తరగతులుగానుండు జాతులను జూచి మనుజుని క్రిమి సమముగా భావించ వలెను. మెట్లు మెట్లుగానుండు నాయాజాతుల జ్ఞానముపెరిగి సంపూర్ణజ్ఞానము చతుర్ముఖుని యెడయున్నది. మనము మిక్కిలిశ్లాఘించు మనశరీరముయొక్క యవయవములు నిరసించదగినవిగాయున్నవి. రక్తము, మాంసము, ఎముక, చర్మము మొదలైనవెల్లను నట్టివే. అయితే యవియెల్లను గలిసి యేర్పడుశరీరము జ్ఞానమునకు నిలయముగానున్నది. కనుక వాటికి దోషమేర్పడినయెడల చికిత్సచేసి సంరక్షించవలసియున్నది.

మహావికారమైన మాంసాదులనుజేర్చి జేయబడిన దేహమందే జ్ఞానముండగా, స్థూలముగాని శరీరముగలజాతులు మనకన్న నధిక జ్ఞానముగల వారుగానుండి తీరవలెను. మనయొక్క జ్ఞానమును క్రిమి కనుగొననేరదు. అవ్విధముగనే మనకుపైనుండు జాతుల యొక్క జ్ఞానమును మనము కనుగొనలేము. కిన్నెరలు, కింపురుషులు, నురగలు, నాగులు, యక్షులు, సిద్ధులు, కర్మదేవతలు, దేవతలుయను యనేకజాతులున్నవి. మనయొక్క దేహమువలె యాభాసముగాని శరీరము వారికియున్నది. ఒకపుష్పము ముఱిగి పోయినచో యది దుర్గంధమిచ్చును. ముఱగనియెడల సుగంధ మిచ్చును. మంటిలో మంచిగుణమున్నది. చెడుగును యున్నది. దానిలోనుంచి వెడలువాటిలోనున్న రెండునుగలవు. మనయొక్క దేహము ప్రకృతిని యాధారముగా గలిగినందున దానిలోమంచి యు చెడుగునుగలవు. దేవశరీరములను వైష్ణవులు యపాకృత శరీరములందురు. అనగా ప్రకృతి ( మన్ను ) సంబంధములేనివి. మనము దేవశరీరములను దివ్యశరీరములనుచున్నాము. అపాకృతములేక, దివ్యశరీరముగల దేవగుణములలో జ్ఞానము తీక్ష్ణముగాయున్నది. వారిలో ప్రమదగణములను నొకశాఖగలదు. వారు కైలాసములో పార్వతీపరమేశ్వరుల సన్నిధిలో కైంకర్యము జేయువారు. వారిలోనొకరికి నొకసమయమందు భక్తి తగ్గిపోయెను. దానిచే ప్రమదగణములోనుండుట కర్హతగోలుపోయిరి. అనగా

వేరేకొన్ని జన్మములెత్తుట తటస్థించెను. వారొక గంధర్వుడుగా జన్మించినారు. గంధర్వజన్మలో వారికి పుష్పదంతుడని పేరు. వారు యీశ్వరుని స్తోత్రము జేసియున్నారు. చేపపిల్లలకు యీత నేర్పించవలయునా! అటులనే గంధర్వులు జన్మముతోనే గానము జేయుదురు, చిత్రములువ్రాయుదురు, గగనమందు సంచరింతురు, ఇటువంటి జన్మము మనకంటేగొప్పదైనను ప్రమదగణములకు మక్కిలి తగ్గినది.

శ్లో॥ వపుః ప్రాదుర్భావాదనుమితమిదం జన్మని పురా పురారే

నకాప్యాపిక్వచిదపి భవంతం ప్రణతవాన్ ।

నమన్ముక్తః సంప్రత్యహ మతను రగ్రేప్యనతిమాన్ ఇతీశ

క్షంతవ్యం తదిదమపరాధద్వయమపి ॥

అని వారుజెపియున్నారు.

దీనియర్థమును జెప్పుచున్నాను. రెండు యపరాధములను క్షమించవలెనని వారు యీశ్వరుని వేడుకొనుచున్నారు. వారు జెప్పుచున్నారు:—నేను దేహము ధరించినందువలన నొకతీర్మానము జేయుచున్నాను. అనగామిమ్ములను యేస్థళమందును యేసమయ మందును నొక్కమారైనను నమస్కరించినదిలేదు. హేత్రిపుర సంహారము జేసినప్రభో! మిమ్ములను నేను నమస్కరించలేదు. దాని నేనెట్లుగ్రహించినాననగా యీదేహమేదానికిసాక్షి. దీనిని నేను తెలుసుకొన్న దానిచేత నిప్పుడిదే నమస్కరించితిని.

ఇకముందు దేహమురాదు. కనుక నిటుపై మీకు నమస్కారము జేయను. ఇదివఱకు నీకునమస్కరించకుండుటే యొకయపరాధము. ఇప్పుడు నమస్కరించిన దానిచేత యికమీాద నమస్కరించకుండు నట్లుజేసుకొన్నది యొకయపరాధము. ఈరెండుయపరాధములను మీారు క్షమించవలయునని వారుప్రార్థించిరి. కనుక మనస్ఫూర్తిగ నీశ్వరుని నమస్కారము జేసినయెడల నికమీాద జన్మములేదనుట నిశ్చయము. పాపములెల్లపోయి ముక్తిగలిగితీరును. వారు యను భవశాలులు. వారియొక్క వాక్యమునమ్మి మనమున్ను శరణాగతి పొందుదము.

మోక్షముపొందు మార్గమింతసులభముగా జెప్పబడియున్నం దున, నితరమతస్థులు మనమతములో మోక్షమునకు మార్గము లేదనిజెప్పి మనలను వారి మతముల నవలంబించమని పిలుచు చున్నారు. మనము క్రైస్తవులమైనచో జాలుయనుచున్నారు. మోక్షమునకుగాను నామతము నవలంబించవలసినదిలేదు. ఈశ్వ రుని నమస్కారము జేయుటేచాలును. ఈశ్వరుని నమస్కరించిన యెడల మోక్షము దొరకునా ? దొరకునని ధృఢముగనమ్మి నమస్కరించినట్లైన నిశ్చయముగాదొరకును.

ఇకనమస్కారము నెట్లుజేయవలయుననుట జెప్పుచున్నాను. నమస్కారముజేయుట, దండము సమర్పించుటయనుచున్నాము. ద్రవిడములో " స్వామీా ! దండం " యనుచున్నారు. ఆంధ్ర

మందు "దండముపెట్ట" మనుచున్నారు. దండమనునది యొక కఱ్ఱ లేకకొయ్య. చేతులోపట్టుకొనియున్న నొకకఱ్ఱను విడిచిన యెడ నది క్రిందికిపడిపోవును. నమస్కారము జేయుట దండమువలె చేయవలెనని సంస్కృతమందు జెప్పుట వాడుక. మనదేహ మొక కఱ్ఱవలె యున్నది. అటువంటి దేహమును మనము ధరించి యున్నాము. దానిని మనము ధరించ మనకు శక్తినొసంగినది యీశ్వరుడు. జ్వరము వచ్చినయెడల క్రిందబడిపోవుచున్నాము. పుణ్యపాపముననుసరించి దేహమునుధరించ శక్తియేర్పడియున్నది. మనముదానిని ధరించుచున్నామను తలంపును విడిచిపెట్టినందుకు నిరూపణముగా క్రింద బడిపోవలెను. అనగా నహంభావమును విడిచి క్రిందకు పడవలెను. లోక కార్యములను జేయుటకు నహంభావము ( నేనుయనుభావము ) కావలెను. తక్కినసమయ ములలోకూడదు. మనము జేయుచున్నామను తలంపు విడిచి నమస్కరించవలెను. సన్నిధానమందు కఱ్ఱవలెపడినచో నితర స్థళములలో నిట్టనిలుచుండగలము. అచట వంగినయెడల, వెలుపల వంగని కిరీటధారిరాజువలె నుండనౌను. మనదికాదని, భారము వారిదని విడిచివేయవలెను. భారము మనదని పెట్టుకొనినయెడల వారియొక్కభారమును వారుతగ్గించుకొనెదరు. మనవిరోధులను శిక్షించుటగూడ వారిపై విడువవలెను. వారిని మన మేదైననడుగ నారంభము జేసినయెడల దానినిచ్చి నూరకుందురు. మనకేది

కావలెనో యేదియక్కరలేదోయనునది మనకు తెలియదు. ఏది కావలయునని యడిగినయెడల, తెలియదనిజెప్పి యూరకుండ వలయును. అప్పుడు మన కేదికావలయునని యడుగవలసిన యవసరములేనిస్థితిని వారొసంగితీరుదురు. కనుక మనమనుభావమును విడిచి వారిని నమస్కరించెదము.

—( 0 )—

## ౧౪. "చిన్ముద్ర."

మన యాదియాచార్యులవతారమెత్తి సుమారు 2500 సంవత్సరములయినటుల పురాతన గ్రంథములో జెప్పబడియున్నది. వారికి నలుగురు శిష్యులుండినటుల రవివర్మపటములలో జూచుచున్నాము. అదేవిధముగా శివాలయములలోను దక్షిణదిశ ప్రాకారమందు పరమశివుడు దక్షిణామూర్తి స్వరూపముగా నలుగురు శిష్యులతో నాసీనులై యున్నారు. వారి కుడిచెయ్యి చిన్ముద్రను జూపించుచున్నది. బొటనవ్రేలును జూపుడువ్రేలును జేర్చి పట్టుకొని దానిద్వారా శిష్యులకుపదేశము జేయుచున్నారు. దీనికి చిన్ముద్రయనిపేరు. అంగుష్ఠమును ( బొటనవ్రేలును ) తర్జనియును ( చూపుడు వ్రేలును ) జేర్చిజూపినయెడల నదియెట్లు జ్ఞానోపదేశమగునని యడుగనౌను. నోటితో శబ్దరూపముగా

జెప్పుటకు బదులుగా, జేతితో తనయుపదేశమును దెలియబఱచు టకు ముద్రయనిపేరు. నాట్యశాస్త్రములలో నొక శ్లోకమును నోటితోజెప్పుటకు బదులుగా నభినయముచే గనబఱచుట గలదు. దేహముయొక్క చేష్టచే నర్థమును దెలియబఱచుటకు ముద్రయనిపేరు. పద్మముద్ర బ్రహ్మనుజెప్పును. వారినిగురించి జెప్పవలసినపుడు, పద్మములో వారు పుట్టినవారుగనుక పద్మమును గనబఱచుటగలదు. విష్ణువును జెప్పునప్పుడు శంఖముద్రను జూపుదురు. చిన్ముద్రయనగా నేమియర్థము? చిత్తనగా జ్ఞానము, ముద్రయనగా జిన్హము. జ్ఞానమును విశదపఱచు జిన్హమనునది దాని యర్థము. పరమశివుడు దక్షిణామూర్తియై జిన్ముద్రను జూపుచున్నారు. వీరివద్ద సనకాదులను నలుగురు వృద్ధశిష్యులున్నారు. మహాలింగమునకు దిన్నగాదక్షిణదిశలో దక్షిణామూర్తి, స్థాపించబడి ప్రతిశివాలయములోను యున్నారు.

శ్లో॥ చిత్రం వటతరో ర్మూలే వృద్ధాశ్శిష్యా గురు ర్యువా।
గురోస్తు మౌనంవ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః॥

దీనియర్థము :—

వటవృక్షమూలమందొక యాశ్చర్యమును జూచితిరా? అచట పదునారేండ్ల వయసుగల చిన్నబాలురొకరు గురువుగను, నలుగురు వృద్ధులు శిష్యులుగను గూర్చొనియున్నారు. ఎచ్చటను వృద్ధులగు గురువును బాలురగు శిష్యులును నుండుట గలదు.

ఇచ్చట వ్యతిరేకముగానున్నది. సాధారణముగ శిష్యులు మౌన ముగాయుండగా గురువు బోధించుచుందును. అయితే వటవృక్ష మూలమందుండు గురుశిష్యులలో, గురువు మాట్లడకనేయుండి శిష్యుల సకలసందేహములను నివర్తిజేయుచున్నారు. వారు తమ చేతివ్రేళ్లతో చిన్ముద్రనుజూపించి సకలసందేహములను బోగొట్టు చున్నారు. ఈచిన్ముద్రచే సకలవేదార్థము దెలుపబడుచున్నది. పరమవస్తువున్నూ, మనజ్ఞానమున్నూ నొకటియేవస్తువను దానిని దక్షిణామూర్తి జిన్ముద్రచే దెలియబఱచుచున్నారు.

ఈస్థళమందనేక కదళీవృక్షములు కట్టబడియున్నవి. అనేక వర్ణములు పూయబడియున్నవి. పలుయలంకారములమర్పబడి యున్నవి. ఇవియన్నియు నుండి దీపములు లేకపోయినయెడల వీనిని జూడలేము. దీపములుండి కన్నులేనియెడల ప్రయోజనము లేదు. రెండూయుండి మనస్సులేకపోయినయెడల యుపయోగము లేదు. అన్నియూయుండి యాత్మలేకపోయినయెడల యితరమెల్లను నుపయోగపడదు. కాన జిత్తుయనగా జ్ఞానమును, పరమవస్తువు నొకటియేవస్తువని జిన్ముద్ర జూపుచున్నది. “ హేయీశా ! ” యని మనముజెప్పునపుడు యాకాశమువైపు చేతులెత్తి చూపుడు వ్రేలుతో మనముజూపెదము. “ నేను ” యని జెప్పునపుడు బొటనవ్రేలుతో హృదయముపై నొత్తిజూపెదము. గనుకచిన్ముద్ర యనునది నేనుయను వస్తువు నీశ్వరుడును, నొకటియేవస్తువ

యని జూపుచున్నది. ఈశ్వరుడెచ్చటలేడూ యెల్లెడలను నిండి యున్నారు, యను బ్రహ్మజీవైక్యమును జిన్ముద్ర దెలియబఱచు చున్నది. జ్ఞానమును మనము నేత్రములతో జూడలేము. కాని ముద్రరూపముగా జూడగలము. మన యాచార్యులీజ్ఞానమునే, ముద్రరూపముగా నలుగురుశిష్యులకు దెలియబఱచుచున్నారని జిత్రములచే దెలుసుకొనుచున్నాము.

సురేశ్వరాచార్యులు, పద్మపాదాచార్యులు, హస్తామలకాచార్యులు, తోటకాచార్యులనబడునవి వారి నలుగురు శిష్యుల పేర్లు. శిష్యులకుపదేశింప గలుగుటకు మనయాచార్యులెవరివద్ద నుంచి జ్ఞానమునుబొందిరి. వారియొక్కగురువెట్లు జ్ఞానముపొందిరి, ఆగురువుయొక్క గురువెటుల జ్ఞానముపొందిరని విచారించునపుడు, మొట్టమొదట జ్ఞానమెవ్వరికి గలిగినదిన్నీ మనము తెలుసుకొన నేర్పడును. మన గురుపరంపరను ధ్యానముజేయుటవల్ల జ్ఞానము క్షేమముగలుగును. ఏవిద్యనభ్యసించునపుడైనను గురుపరంపరను దెలుసుకొని పఠించునెడల వారందరియొక్క యనుగ్రహము మనకు గలుగును.

శ్లో॥ నారాయణం పద్మభువం వశిష్ఠం
శక్తించ తత్పుత్ర పరాశరంచ।
వ్యాసంశుకం గౌడపదం మహాంతం
గోవింద యోగీంద్ర మథాస్యశిష్యమ్ ॥

శ్లో॥ శ్రీశంకరాచార్య మథాస్యపద్మ
పాదంచ హస్తామలకఞ్చ శిష్యమ్ ।
తంతోటకం వార్తికకారమన్యా
నస్మద్గురూన్ సంతతమానతోఽస్మి ॥

గోవిందభగవత్పాదులు మనయాచార్యులయొక్క గురువు. తమయొక్క గురువును ధ్యానముజేయుటకు మనయాచార్యులు "భజగోవింద" మను గ్రంథమునురచించిరి. దానిలో శ్రీమహావిష్ణువనుపేరును, నాచార్యులయొక్క గురువుపేరును గలిసి వచ్చుచున్నవి. పైనజెప్పిన గురుపరంపరాశ్లోకమందు జెప్పబడియున్న వారలలో శ్రీమన్నారాయణుడు మొదలుశుకులవరకు శిష్యులు పుత్రపరంపరగా నున్నారు. పిదప గౌడపాదులు మొదలు శిష్య పరంపర. ఈపీఠమటువంటి మహనీయులవలన ప్రతిష్ఠ జేయబడినది. వింధ్యపర్వతమునకుత్తరమందుండు బ్రాహ్మణులకు పంచగౌడులనియు, నాపర్వతమునకు దక్షిణమందుండు బ్రాహ్మణులకు బంచద్రావిడులనియు బేరు. మనయాచార్యుల గురువుయొక్క గురువగు గౌడపాదులు గౌడులతెగలో జేరినవారు. వారియొక్కశిష్యులు, మనయాచార్యుల గురువైన గోవిందయోగీంద్రులు. వారిశిష్యులు మనయాచార్యులు.

స్వాములవారు జెప్పునది వినవలెనని మీారనేకజనులు చాలాసేపు కాచుకొనియున్నారు. నేనులోపల నెవరితోనైన

మాట్లాడుచూ వృథాకాలక్షేపముజేయక, మీయొక్కతీవ్రాభి లాష ఫలముగా గురుపరంపరను స్మరించనేర్పడినది. అటుల స్మరించినదానిచే ధన్యుడనై తిని.

—(0)—

## ౧౫. "అంబిక యనుగ్రహము."

అంబిక యనుగ్రహమున్న యెడల మనకు వాక్కుచక్కగా వచ్చును. అంబయే వాక్స్వరూపము. మనదేశములో మహాకవీ శ్వరులను గొప్పవారినిగ భావించుటగలదు. ఒక్కొకతరములో, 33 కోట్ల జనులలో, నొకరేమహాకవిగాను యంబయొక్క కటా క్షమును బొందినవారుగానుండగలరు. అట్టివారియొక్క జన్మమే జన్మము. ఒక్కొకతరములోను మహాకవిగానుండియున్న వారిలో నొకరు తక్కినవారికన్ననుత్కృష్టులుగా నంగీకరింపబడియున్నారు. వారు కాళిదాసు. మూడువేలు లేకనాలుగువేల వర్షములలోపుగా వారుండినవారు. వారివంటి గొప్పవారల పటములు లేవుగాని వారిపేరు ప్రఖ్యాతిపొందియున్నది. వారియొక్కపేరును పరిశీలించి నచో వారు యంబయొక్కదాసులని దెలియుచున్నది. వారనేక గ్రంథములను సంస్కృత భాషలో రచించియున్నారు. పాఠ శాలలో బాలురు జదువదగిన గ్రంథములను జేసియున్నారు.

వాక్కు యంబయొక్కస్వరూపమని వారు రఘువంశ ప్రథమశ్లోక మందు జెప్పియున్నారు.

శ్లో॥ వాగర్థా విన సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే ।
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ ॥

వాక్కు దానియర్థము యెటుల నొకదానితో నొకటికలిసి యున్నవో నటులనే పార్వతియు, పరమేశ్వరుడును నేకముగా నున్నారు. వస్తువొకటే. ఒకయాసనమని మనము జెప్పునప్పుడు కూర్చుండతగిన పీటయనుయర్థము స్వయముగ ప్రకటమగు చున్నది. పదము నర్థముకలిసియేయున్నవను నభిప్రాయమును కాళిదాసుశ్లోకమందు జెప్పియున్నారు. సకలశాస్త్రకోవిదులును వారిని మహాకవియని యంగీకరించియున్నారు.

రఘుమహారాజునకు పూర్వము దిలీపుడనునొక చక్రవర్తి యుండెను. రఘువంశకథ వీరికాలమునందే యారంభమగు చున్నది. దిలీపుడు, రఘువు, అజుడు, దశరథుడు, రాముడు, కుశుడుయను వారలచరిత్రములను గూర్చియు కుశునకు పిమ్మట వచ్చిన యనేకతరములను గూర్చియు, కాళిదాసు రఘువంశ మందు జెప్పియున్నారు. శ్రీరాములు వైకుంఠము వేంచేసిన తదుపరి, సరయూనదిలో జనులెల్లరుప్రవేశించిరి. కుశునకు విరక్తిగలిగి యయోధ్యనువీడి కుశావతియను నొకపట్టణమునునిర్మించి దాని నేలుచుండెను. అయితే తమపెద్దలున్న యయోధ్యయొక్క యధి

స్థానదేవతను వారుకుశావతిలో మంత్రములతో బూజించుచు వచ్చిరి. ఒకనాటిరాత్రి కుశుడు తనయన్తఃపురమందు నిద్రించునపుడు నాదేవత వానిసమీపమునకువచ్చి నిలిచి, వానికిదర్శనమిచ్చెను. కుశుడుమేల్కాంచి యచట నిలుచున్నవారెవరని తెలుసుకొనక,

శ్లో॥ కా త్వం శుభే కస్య పరిగ్రహో వా
కిం వా మదభ్యాగమకారణం తే।
ఆచక్ష్వ మత్వా వశినాం రఘూనాం
మనః పరస్త్రీవిముఖప్రవృత్తిః॥ అని యడిగెను.

శ్లోకముయొక్క యర్థము :—

సర్వోత్తమమైన గుణములుగల నీవెవరవు ? నీవెవరిభార్యవు ? రఘువంశములో నుదయించినవారికి యేస్త్రీనిజూచినను నెట్టి యే కాంతకాలమందును మనస్సుచెలించదు. కనుక నీవుయెందుకిచటికి వచ్చినావు ? సందేహాభయములను వీడి బదులుజెప్పుమని యడిగినాడు. అప్పుడు యంబిక వారిని జూచి జెప్పుచున్నది :—

శ్లో॥ చిత్రద్విపాః పద్మవనావతీర్ణాః
కరేణుభి ర్దత్తమృణాళభఙ్గాః।
నఖాఙ్కుశాఘాతవిభిన్నకంభాః
సంరబ్ధసింహప్రహృతం వహంతి॥

హేకుశ ! నీవుయయోధ్యను వీడుట న్యాయముగాదు. మీపెద్దలున్ననగరమునకు నీవువచ్చితీరవలెను. నేనుయయోధ్య

యొక్క యధిష్ఠానదేవతను. నీవువచ్చినతదుపరి యయోధ్యలో ననేక లోపములేర్పడియున్నవి.

అయోధ్యలో రమణీయమగు సౌధములున్నవి. అయితే జనులులేరు. సౌధములలో చిత్రములు వ్రాయబడియున్నవి. ఒక చిత్రమందు రెండుయేనుగులు తామరి తటాకమందు జొచ్చియున్నవి. ఆడయేనుగ తనప్రేమనుభర్తకుజూప తామరతూండ్లను తొండముతో తీసి తనభర్తకు నర్పణముజేయుచున్నది. ఇటుల నయోధ్యలో యేనుగ చిత్రములో గానబడుటయేగాని నిజముగా లేదని యంబికజెప్పినట్లు కాళిదాసు జెప్పియున్నారు. జనులువీడి వెడలిపోయినందున నగరముయొక్కకళపోవుచున్నది. జింజికోటను జూడుడు. పురాతన కట్టడములున్నవి. జనులు లేరు. పులులు విశేషముగాయున్నవి. దేశింగరాజు నివసించినస్థళము వ్యాఘ్రము లకు వాసస్థానమాయెను.

నిర్జనముగ నయోధ్యను విడిచినది సరికాదని యంబిక, కుశునికిజెప్ప, నందుపైవాడయోధ్యకు తిరిగిపోయెను. అంబిక నారాధించుచుండినందున కుశుడామెను ప్రత్యక్షముగాజూచు భాగ్యముబొందెను.

మనయాదియాచార్యులు రచించినగ్రంథములలో సౌందర్యలహరి యొకటి. దానిలోనొకశ్లోకమందు సౌందర్యలహరియను పద ప్రయోగముగలదు. దానినే గ్రంథముయొక్క నామధేయముగా

నొనర్చిరి. "శివానందలహరి" యనియు "భజగోవింద" మనియు "హరిమీడేస్తుతి" యనియు "ప్రబోధసుధాకర" మనియు వారుచేసియున్నారు. హరిమీడేస్తుతియనుటకు విష్ణువును స్తోత్రము జేయుచున్నారనియర్థము. ప్రబోధసుధాకరమనగా నజ్ఞానమును నివర్తి జేసి జ్ఞానమును గలిగించునది యనియర్థము.

శ్లో॥ చేత శ్చంచలతాం విహాయ పురతః సంధాయ కోటిద్వయం
తత్రైకత్ర నిధేహి సర్వవిషయా నన్యత్ర చ శ్రీపతిమ్ ।
విశ్రాంతి ర్హితమప్యహో క్వనుతయోర్మధ్యే తదాలోచ్యతాం
యుక్త్యావానుభవేన యత్రపరమానందశ్చత త్సేవ్యతామ్ ॥

అను ప్రబోధసుధాకరమందుండు శ్లోకముయొక్క యర్థము జెప్పుచున్నాను :—

హేమనసా ! త్రాసుయొక్కముల్లు చెలించకుండ సూటిగ నిలుచునట్లు, నీవునీచలనమును నిరోధించి నించుకసేపు నాలోచన చేసిచూడుము. ఒకవైపుపళ్లెములో నీయాశలెల్లను పెట్టి మరియొక పళ్లెములో శ్రీహరిని బెట్టిజూడుము. అప్పుడేది విశేషమైనది దెలియును. నీకు దేనిదేనియందు యాశయున్నదో దానిదానినెల్ల నొకవరుసగా నేర్పాటుజేసుకొని అదివద్దు అదివద్దనుచు నొక టొకటిగ గొట్టివేసినయెడల నదియేమోక్షమునకు మార్గమౌను. అనగా మనస్సు నేకాగ్రముజేసుకొని భక్తి జేసినయెడల మోక్షము సిద్ధించును. ఇటువంటివిషయములను మీకెల్లరకును జెప్పుటకు

మన యాచార్యులుత్తరువుజేసిరి. మీరందరును సన్మార్గమందుండిన యెడల నంబిక యనుగ్రహము తక్షణమేగలుగును. భక్తినభివృద్ధి జేయ మీరెల్లరును బ్రయత్నము జేయవలెను. ఏకార్యమును జేయునప్పుడైనను ఈశ్వరుని ధ్యానము జేయుచుండవలెను.

—( 0 )—

# ౧౬. తిలకధారణము.

హిందూమతస్థులకున్ను, యితరమతస్థులకున్ను, దృష్టిలో నొకభేదము తిలకధారణమువల్ల నేర్పడుచున్నది. ఒకడు హిందు వనుటకు తిలకధారణము గొప్పచిహ్నము. తిలకము పెట్టుకొనని హిందువు యనేకసమయములలో యితరమతస్థుడుగా గ్రహింప బడుటగలదు. సత్స్వభావమున్ను, సన్మార్గప్రవర్తనమున్ను మనకు కలుగునట్లుగా తిలకధారణము సహాయముజేయుచున్నది. హిందువులు తిలకధారణము జేసుకొనక నెట్టిశుభకార్యమును జేయ కూడదు. ద్రవిడములో నామమునకు, తిరుమణియనియు, విభూతికి, "తిరునీఱు;" యనియుపేరు. రెంటిలో, తిరుయను, విశేషణము, శ్రేష్ఠవాచకమైయున్నది. మన్నుయనునది ప్రకృతి, నీఱు యనునది, భస్మము. పరమేశ్వరుని సృష్టిలో ప్రథమపదార్థము మన్ను. దానివలననే పంచభూతములలో ప్రకృతి మొదట జెప్ప

బడియున్నది. ఆదివరాహమూర్తి, భూమిని జలములోనుంచి ఉద్ధరించినారు. "ఉద్ధృతాసావరాహేణ" అనిఇందుకు ప్రమాణమున్నది. మన్ను మిక్కిలి పవిత్రమైనవస్తువు. భూమిలేనియెడల మనముండుటకు స్థలముండదు. ఆహారమున్ను దొరకదు. భూమిలో సకలప్రాణులున్ను జీవించుచున్నవి. మహావిష్ణువు జగత్తును పరిపాలించువారు. కనుక భూమినుద్ధరించిరి. భూమిని మనము భూదేవియనుచున్నాము. భూమిని విష్ణుప్రసాదముగా విష్ణుభక్తులుదలచి, విష్ణుపాదాకృతిగా, తిరుమణిని లలాటమందు ధరించుచున్నారు. తిరుమణియొక్క వర్ణము తెలుపుగానున్నది. అటులనే భస్మమున్ను తెల్లగానున్నది.

భస్మమునకు మూలమైనగోవు మనవల్ల పూజింపబడుచున్నది. అదితనదూడకు పాలిచ్చి రక్షించుటయేగాక, సకలజనులకున్ను పాలిచ్చి వారినిన్ని రక్షించుచున్నది. కాన గోవు సర్వజనులకు తల్లియైయున్నది. ఆకారణమునుబట్టియే దానిని గోమాతయని జెప్పుచున్నాము. విశేషగుణములు నిండియుండు గోకులమందు శ్రీకృష్ణుడు వర్ధిల్లినదే గోవుయొక్క గొప్పను తెలియజేయుచున్నది. గోమయము దేనినైనను శుద్ధిజేయును. దానినగ్నిలో వేసినయెడల దానివన్నెను మార్చుకొని తుల్యమైనతెలుపువన్నెను పొందుచున్నది. ప్రపంచమందు మాయవలనదోచు దుఃఖము, అసూయ, పాపము మొదలగునవి యంతరించి యంత్యమందు

పరమేశ్వరు డొక్కడే నిలుచు రీతిని, గోమయమును తనవన్నెను వాసనను విడిచి, పరిశుద్ధమైన భస్మమగుచున్నది. కనుకనే విభూతి శివస్వరూపము. సర్వమున్నూ తనలో లయమగునట్లు జేయు శివుడే విభూతి. శివస్వరూపమైన విభూతి దేహముపైనను, లలాటమందును, మొదట ధరించుకొని, పిదప, పరబ్రహ్మ, మూడు గుణములతోగూడి మూడుమూర్తుల స్వరూపమై వెలయుచున్నదని జ్ఞాపకము దెచ్చుకొనుటకు మూడు రేఖలుగా ధరించుచున్నాము.

విభూతి దొరకనప్పుడు ఏమంటిపై నిలుచుచున్నామో, నామంటినే తీసి ధరించనౌను. ఆమన్ను పరమేశ్వర స్వరూపమే. సకలమును పరమేశ్వరస్వరూపమే. విభూతి కుంకుమప్రసాదములు దొరుకుటకు మనము కష్టపడవలసినదిలేదు. భూమిపైనుండు మన్ను ఈశ్వరప్రసాదమే. దానిని మనముధరించనౌను. సకలము నీశ్వర స్వరూపమేయని మనము దలంచునెడల పాపమేజేయము. సకలము నీశ్వరస్వరూపమని దలంచుటచాలదు. ఈశ్వరస్వరూపమని తెలుసుకోవలెను.

ఈకాలమందు నవీనశాస్త్రములు నేర్చినవారనేక విచిత్రవస్తువులను జేయుచున్నారు. అయినను సృష్టిలోనుండు వస్తువుల బెట్టుకొనియే, వారు వేరువస్తువులనుజేయ సాధ్యమగుచున్నది.

ఈశ్వరుడు సృష్టించిన యరటిచెట్టును వారుజేయ సాధ్యము కాదు. ఈశ్వరునియొక్క శక్తిని యీయొకవిషయమే జూపించు చున్నది.

ఇప్పుడు చలి, వాన మిక్కిలిగానుండుకాలము. ఇవ్విధము గనే యెండయధికోగ్రముగా నుండుకాలము వచ్చునని మనమూహించగలము. ఈకాలమందు పాపము అధికముగాయున్నది. ఉదయము మొదలు శయనించువరకు పాపములు జేయుచున్నాము. మున్నొకకాలమందు పుణ్యమునేజేయుచుండిన మహాజ్ఞానులుండి తీరవలెనని మనమూహించనౌను. ఈమహాజ్ఞానులు మనకు మహోపకారము జేసియున్నారు. మనమెల్లవస్తువులను పరమేశ్వర స్వరూపమని తెలుసుకొనుట కష్టమని దలంచి జ్ఞానులు కొన్ని క్షేత్రములకును తీర్థములకును వెళ్లి, పరమేశ్వరా! ఈక్షేత్రములును, తీర్థములును విశేషమహిమను గలవిగానుండి యీస్థలములకువచ్చు భక్తుల కనుగ్రహము జేయవలెనని వారియొక్క మంత్రశక్తివలన నీశ్వరుని ప్రార్థించినారు.

పత్తిని ఎండలోవేసినయెడల నది రగులుకొనదు. అయితే యొకభూతయద్దమును ( లెన్సు ) పెట్టి దాని కిరణములను దాని మూలముగా పత్తిపై పడునట్లు జేసినయెడల పత్తి రగులుకొనును. అదేవిధముగా నొకజలమును గంగాజలముగాను, నొకరాతిని స్వామిగాను, నొకమన్నును భస్మముగాను, నొకక్షేత్రమును

పుణ్యక్షేత్రముగాను భావించి మనము భక్తిని ప్రవేశింపజేసిన యెడల మన సకలపాపములు దొలగిపోవును.

కనుక మన పెద్దలున్నరీతియు, శాస్త్రములుజెప్పు రీతియు వారు వారు, వారి వారికి దగిన విభూతియో లేక తిరుమణియో ముఖమందు ధరించి కామక్రోధములను విడిచి యాలయములకు ప్రతిదినమువెళ్లి పరమేశ్వరుని కృపను సంపాదించ ప్రయత్నము జేయవలెను.

—(0)—

# ౧౭. సంధ్యావందనము.

కర్మలలో సంధ్యావందనము ముఖ్యమైనది. దాని గౌరవము జెప్పతరముగాదు. తప్పక దాని నాచరించుచూ రావలెను. మనకు శరీరయసౌఖ్య మేర్పడినను సంధ్యావందనము విడువకూడదు. పూర్వకాలమందు మనపెద్దలకు నేదేని శరీరయసౌఖ్య మేర్పడిన యెడల బంధువులలో నెవరినేని బిలిచి తమకుగాను సంధ్యావందనము మఱియొకమారు జేయునట్లుజేసి వారిద్వారా తీర్థమును బ్రాశనజేయుట వాడుక. మనమును నావిధముగనే జేయవలెను. మనమభివాదనమందు ప్రవరజెప్పునప్పుడు యనేక ఋషులయొక్క నామములను జెప్పుచున్నాము. ఆఋషుల కాల

మునుండి నెడలెగక నడుచుచూ వచ్చుచున్న నీకర్మ, మన కాల మందు కత్తిరింపబడకుండ మన యాయువుండువరకు స్థిరముగా జేయవలెను.

" గాయత్రీ మాత్రసారోఽపి ద్విజో భవతి నిర్భయః "

ఒకరు నిర్భయముగా నుండవలెనంటే వేదాధ్యయనము జేయవలెను. లేనియెడల గాయత్రిని హృదయమందిడుకొని యుపాసించినయెడల నిహాపర సౌఖ్యములు లభ్యమగును. సంధ్యా వందనములో ప్రధానము, యర్ఘ్యము, గాయత్రీ జపము. సంధ్యా వందనముయొక్క యంగములు, సంకల్పము, ప్రోక్షణము, ప్రాశ నము, యర్ఘ్యము, మొదలగునవి. వీటినిక్రమముగా జేయుచూ వచ్చినయెడల జిత్తశుద్ధియు, దేహశుద్ధియు గలుగును. ఇంద్రియ ములు స్పర్శించినందున నవి శుద్ధిపొందును. ప్రాణాయామము చిత్తశుద్ధిని గలుగజేయును. సంధ్యావందనమును నంగములతో జేయనిచో వ్యంగమగును.

గాయత్రిని యుపాసన జేసినచో పాపమేర్పడనేరదు. ఇది కావలెను యదికావలెను యను యాశలేకుండ, గాయత్రిని జపించిన యెడల భయమేర్పడనేరదు. ఈకాలమందు " హిప్నటిసమ్, " " మెస్మరిస " మని జెప్పబడువిద్యల నభ్యసించుచున్నారు. ఇత రులమనస్సును తెలిసికొనుటయు, పరులమనస్సును వశ్యపరచు కొనుటయు వాటిప్రయోజనము. వీటికన్న ననేకరెట్లు గొప్పశక్తిని

గాయత్ర్యుపాసన నిచ్చును. పునర్జన్మ లేకుండజేసి యిహమందు సౌఖ్యములనిచ్చును. సంధ్యావందన యంత్యమందు యభివాద నాదులు ముఖ్యము. ప్రవర జెప్పునప్పుడు గొన్ని గోత్రికులు రెండు ఋషులను, గొందరు మూడు ఋషులను, గొందరు పంచ ఋషులను జెప్పుటగలదు. అనగా మనపూర్వీకులలో మహాత్మ్ము లుండిరని జెప్పుచున్నాము. అట్టిగొప్ప వారివద్దనుంచి తర తర ముగా వచ్చుచుండు సంధ్యావందనమును నుపదేశమూలముగా మనముగ్రహించి గాయత్ర్యుపదేశమగు యగ్నినలుసు ప్రజ్వలించు నట్లుజేసి సకలక్షేమములను పొందవలెను.

ఆంధ్రబ్రాహ్మణులు "చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మ ణేభ్యో శుభం భవతు" యని మొదటజెప్పి పిదప ఋషుల యొక్క నామములను జెప్పుటవాడుక. అనగా నాలుగు సముద్ర ములకు నడుమయుండు గోవులు మొదలగు సకలప్రాణులును, బ్రాహ్మణులు మొదలగు సకలజనులును క్షేమముగా నుండవలె నని ప్రార్థించిన పిదప తమ వంశఋషులయొక్క పేర్లనుజెప్పి నమస్కారము జేయుచున్నారు. పూర్వకాలమందును బ్రాహ్మ ణులు, పశువులు నెల్లెడల వ్యాపించి యుండిరని తెలియుచున్నది. ఇప్పుడు శ్రీవత్సగోత్రోద్భవు డొకడు "భార్గవ, చ్యవన, ఆప్న వాన, ఔర్వ, జామదగ్నియ," యను పంచఋషుల నామములు జెప్పునప్పుడు తనయొక్క గోత్రమందు దనకు ముందుగానుండు

పెద్దలలో భార్గవులు, చ్యవనులు మొదలగు పెద్దలుండిన దానిని దెలుసుకొనుచున్నాడు. ఇటువంటి మనకు శక్తినిచ్చునదియు, మహిమనిచ్చునదియు యగు సంధ్యావందనమును వదలివేయక, యాచరించి యందరును నిహపరక్షేమమును పొందవలెను.

—(౦)—

# ౧౫. "స్థూలసూక్ష్మ దేహములు".

"మన" మని నొకవస్తువును జెప్పుచున్నాము. దాని వాస స్థానము మనదేహము. ఈదేహము స్థూలమైనది. చర్మము, మాంసము, మజ్జ మొదలగునవి జేరి స్థూలదేహమైయున్నది. మనస్సు సూక్ష్మమైనది. నాయొక్క మనస్సని జెప్పుచున్నాము. కొందరి స్థూలదేహము బలముగలదిగాను, కొందరిస్థూలదేహము బలములేనిదిగను నున్నది. మనము కొద్దిగా ప్రయత్నము జేసిన యెడల నీస్థూలదేహమునకు విశేషబలమును సంపాదించ శక్యమగును. అతిశీఘ్రమందు శాన్డోయను పైల్వానువలె గావచ్చును. అప్పుడు సామాన్యముగా జేయశక్యముగాని గార్యములను సులభముగా జేయశక్యమగును. ఒక యేనుగను రొమ్ముపై ధరించనౌను. ఇటువంటి శక్తిని సర్వేశ్వరు డెల్లరకును నిచ్చియున్నారు.

దానిని మనము వృద్ధిజేసుకోవలెను. వృద్ధిజేసుకోదగిన శక్తి మన వద్ద పుట్టుక మొదలు నణిగియున్నది. అయితే యటుల నొక బరువును భరించుట కొకహద్దుగలదు. అదిస్థూలశరీరము యొక్క గుణము.

అయితే మనస్సును సూక్ష్మదేహ విషయమందునను ప్రయాసపెట్టిన యెడల నపరిమితమైన శక్తిని బొందనౌను. స్థూల దేహమువలన గొంతదూరము బోనౌను. ప్రయత్నించి యొక కట్టడము కట్టనౌను. అయితే మనస్సుచే నెంతదూరమైనను పోగలము. ఎన్నికట్టడములు గావలయునన్నను గట్టశక్యమౌను. కనుక మనస్సుయొక్క శక్తిని మనము వృద్ధిజేసినయెడల హద్దులేని శక్తినిపొంది సకలగార్యములు జేయశక్యమగును. బ్రహ్మపదమును పొందుట మొదలగు గార్యములను మనశ్శక్తిచేతనే జేయ సాధ్యమగును. అన్నివస్తువులొకటే యనెడు నైక్యభావమును మనము మనస్సులోతలంచవలెను. దక్షిణామూర్తి యష్టకఫలశ్రుతియందు,

శ్లో॥ సర్వాత్మత్వ మితి స్ఫుటీకృత మిదం యస్మా దముష్మింస్తవే
తేనాస్య శ్రవణా త్తదర్థమననా ద్ధ్యానాచ్చ సంకీర్తనాత్ ।
సర్వాత్మత్వ మహావిభూతిసహితం స్యాదీశ్వరత్వం స్వతః
సిద్ధ్యే త్తత్పునరష్టధాపరిణతంచై శ్వర్య మవ్యాహతమ్ ॥

అని జెప్పబడియున్నది. మనకంటె వేరొకటి యున్నదని మనము భావించుదుమేని, కొన్నిటికన్న మనము తక్కువయని తోచును. అన్నియును మనమేయని నేకభావముగా దలంచుదుమేని యప్పుడు సమత్వబుద్ధి యేర్పడును. సర్వాత్మ తత్త్వమును దెలుసుకొని, దానిని ధ్యానించినచో యణిమాది యష్టైశ్వర్యములు సంప్రాప్తమగును. దానితో నీశ్వరత్వమును బొందవచ్చును. కనుక మనస్సును నభివృద్ధి జేయుటవలన నీశ్వరత్వమే ప్రాప్తించి తీరును. ఇందుకు సందేహములేదు. కనుక నెల్లరును నేక కాలమందున నిందుకు ప్రయత్నము జేయవలెను. ఈప్రయత్నమునకు సాధకముగ నంతరంగబహిరంగ సాధనలు జెప్పబడియున్నవి. అన్తరంగసాధనములు శాంతి దాన్తి మొదలగునవి. బహిరంగసాధనములు, స్నానసంధ్యాదులు. ప్రతియొక్క జీవాత్మయును తానుకడతేరుటకు బైనజెప్పిన సాధనల ననుష్ఠించవలెను. కొందరు పెద్దలు తమకు ప్రాప్తించిన ఫలమును పరులకొసంగుటయు గలదు. శాస్త్రములలో మహనీయులు జెప్పియుండు సాధనముల ననుష్ఠించి ఫలమునుబొంది కడతేర తగినవారు కోటిలో నొక్కరేని యుండినచో వారొకరివలన, ననేకులు శ్రేయస్సును బొందుదురు.

మనుష్యుడు గుణవంతుడు గావలయునని ప్రయత్నించుచున్నాడు. ఏకార్యమున్ను నీశ్వరార్పణబుద్ధితో మనము జేయవలెను. ఏకాలమందును నహంభావమును విడిచితీరవలెను. పరులు

మెచ్చవలెనని పూజలు మొదలైనవి జేయుట వ్యర్థము. బ్రహ్మా ర్పణ బుద్ధితో మనము జేయుగార్యములు మనయొక్క దృఢ భక్తిని దెలుపును. సద్గుణము లేనియెడల భక్తి నిలువనేరదు.

అనగా న్యాయమార్గ ప్రవర్తనలోనుండు గుణవంతునికి తిర్యగ్జంతువులైన పశువులును, పక్షులును గూడ సహాయము జేయుచున్నవి. ఎవడు యన్యాయమార్గమందు బోవుచున్నాడో వానిని సహోదరుడు సహితము సర్వులున్ను చేయి విడిచి వేయుదురు.

శ్లో॥ యాన్తి న్యాయప్రవృత్తస్య తిర్యఞ్చోఽపి సహాయతామ్ ।
అపన్థానం తు గచ్ఛన్తం సోదరోఽపి విముఞ్చతి ॥

ఈశ్వరుడు మనుష్యుని బుద్ధిగలవానిగా సృష్టించియున్నాడు. అనగా పుణ్యాపాపములను దెలుసుకొని యూర్ధ్వలోకమును బొందుటకు బ్రయత్నము జేయదగినవానిగా సృష్టించియున్నాడు. ఈబుద్ధి పక్షులకును, మృగములకును లేదు. వాటికి బుణ్యాపాపములు లేవు. ఒక పశువొకనిని పొడిచి విడిచినచో దానికి బాపము లేదు. ఏలననగా నపకారము జేయవలెనను తలంపు దానికిలేదు. అయితే మనుష్యుడదేపని జేసినచో దానిఫలమును ననుభవించుచున్నాడు. దుర్గుణములుగల నొకడు యెంత ద్రవ్యవంతుడుగా నుండినను, నెంతవిద్వాంసుడుగా నుండినను జనులు వానిని లెక్క జేయరు. దుష్టుడని నిందింతురు. వానిని శిక్షింప బ్రయత్నము

జేయుదురు. దుష్టుల నభిమానించుట పాపము. వారిని శిక్షించుట పుణ్యము. ఈయభిప్రాయమే పై శ్లోకమందు జెప్పబడియున్నది. ఈశ్లోకముయొక్క తాత్పర్యము 2400 శ్లోకములై రామాయణ మైయున్నది. మిక్కిలి పరాక్రమశాలియై సకల కళ్యాణగుణములు గలిగిన శ్రీరామునికి తిర్యగ్జంతువులైన వానరములు సహాయము జేసెనని మనకుదెలియును. దుర్మార్గుడైన రావణుడు తనయొక్క సహోదరుడైన విభీషణుని చేతను విడువబడెను. కనుక మనుష్యునికి గుణమే ప్రధానమైనది. మనదేశమందు పరస్పర విరుద్ధముగాదోచు వెవ్వేరుమతములు వ్యాపకము బొందియున్నవి. వైష్ణవులు, శైవులు, మధ్వులు మొదలైనవారు నొకరి నొకరు నిందించుకొనుచున్నారు. ఒక్కొక కాలమందొక్కొక మతాచార్యులు తమతమ మతమును ప్రచారము జేసినప్పుడు జనులు నాయా యాచార్యులను నభిమానించి వారియొక్క మతమును స్వీకరించిరి. ఇందుకు కారణము నాయా యాచార్యులయొక్క గుణమే. వారు తమ తమ మతమును స్థాపించినందుకు వారి వారి గుణమును వాక్చాతుర్యమును యోచనలును ముఖ్యాధారములై యుండెను. అనేకజనులు సమ్మతించిన విషయములను సత్యముగను నీశ్వరసమ్మతమైనవిగను జనులు గ్రహించెదరు. అయితే కొన్నిమతములలో బహుజన సమ్మతమైన విషయము సత్యము

లేనిదిగానుండును. కల్లుతాగుట బహుజన సమ్మతమైన గార్య మగనున్నది. దానిని మనము సరియైన గార్యమని నొప్పలేము. కాన (మెజారిటి) బహుజనులు సమ్మతించిన నెల్లగార్యములు సత్యమని నిశ్చయము జేయబడదగినవి గావు. ఏకార్యమైనను జక్కగా విచారించి జేయవలెను.

కోట్లకొలది ధనమును దమపాదములపైనుంచినను దానిని యలక్ష్యముగా దలంచు పుణ్యాత్ములు లోకములో నొకరైన నుండియే తీరుదురు. అటువంటి మహనీయుల సహాయమువల్ల రాజులు రాజ్యపరిపాలనము జేయవలెను. పూర్వకాలమందు వశిష్ఠ విశ్వామిత్రులు పైజెప్పిన గుణముగల పుణ్యాత్ములుగా నుండిరి. వారియొక్క యోచనలేక రాజ్యమందేకార్యమైనను జేయబడనేరదు. ధనముతో గుణముగూడి యుండెనేని నొక రాజ్యము ప్రకాశించును. ధనముగల నెల్లరును బుణ్యము జేయుట లేదు. ఎవరివద్ద గుణముగలదో వారు సౌఖ్యమును బొందుదురు. సత్యమునేజెప్పుట, మాతృ పితృభక్తి మొదలైనవి, గుణము లగును. ఒకరు నింకొకరిని గౌరవించినపుడు వారియొక్కగుణము ననుసరించే గౌరవించుచున్నారు. పూర్వకాలమందు మంచి గుణ ములు గలవారు యరణ్యములో పత్రములు, ఫలములు భుజిం

చుచు తపముజేయుచూ వచ్చిరి. రాజులు వారిని వెదకుచూ రాజ్యమునకు తోడ్కొనివచ్చి వారి యనుగ్రహమును బొందిరి.

సుగుణము లోకకోటికిగాగూడి యొక రూపమునుదాల్చి లోకమందొక వస్తువుగా బుట్టునప్పుడు దానిని యవతారమని జెప్పుచున్నాము. ఇందు కుదాహరణము శ్రీరామావతారమును గైకొననౌను. అవతారపురుషులు తమయొక్క సుగుణములను నొకొక్క విషయమందు జూపించుచుందురు. శ్రీరాములు మహా శాన్తముగలవారు. అనేక కష్టముల ననుభవించిరి. అనేక కష్టములలోను వారు తమయొక్క శాంతమును వీడలేదు. అధర్మ మార్గమందు ప్రవర్తించలేదు. పితృవాక్య పరిపాలన మొనర్చుటకే వారు సకల కష్టముల ననుభవించిరి. పితాజ్ఞ ననుష్ఠించుటలో బుణ్యపాప విచారణ మనకు సంబంధించినది గాదు.

"రామాదివ ర్వర్తితవ్యమ్ । న రావణాదివత్ ॥"

అనిపురాణములు బోధించుచున్నవి. పురాణములలో మనము బుద్ధిని ప్రవేశపెట్టుట విడువకూడదు. ధర్మమును స్థాపించుటకు ధర్మశాస్త్రములున్నవి. కథలలోనుంచి మనము ధర్మమును తెలుసుకొననౌను. అప్పుడు మనమొక పురాణము నెందుకు జదువవలెనని యడుగనౌను. ధర్మము నుపన్యసించుటకు బదులుగా వాటిని చరిత్రమూలకముగా మనము దెలుసుకొనిన యెడల

౹-ధర్మములు జక్కగా మనన్సులోపట్టి తీరును. ఇదియే పురాణ ములయొక్క తత్త్వము. మనము మంచిగుణము నభిమానించు రము కనుక సద్గుణమును సంపాదించవలెను. ఆశను విడిచిన యెడలనే మనకుసద్గుణములు గలుగును. లోకమును విడిచిన యెడల మనకు సకల శ్రేయస్సును గలుగును.

స మా ప్త ము .

శ్రీ శ్రీ శ్రీ

శ్రీఈశ్వరనామ సం॥ కార్తీక బ॥ ౧౦ శనివారము. ది॥ 27-11-1937 సం॥ చ॥ 23-2-1347 ఫ॥

చిదానంద మఠము, సుల్తాన్ బజారు, హైదారాబాద్ దక్కన్.

